# చంద్రవదన

## చాకచక్యం

"ఎల్లోరా"



# చంద్రవదన చాకచక్యం

(పిల్లల నవల)

"ఎల్లోరా"

శ్రీ రామకృష్ణా అండ్ కో
విజయవాడ-1.

3

# చంద్రవదన చాకచక్యం

స్వర్ణపురిమహారాజ్యం వింతలకూ, విశేషాలకూ పేరు పొందింది! ఆవింతలూ, విశేషాలూ చూదామనే తలంపుతో వెళ్ళిన ఒక కుటుంబం ఒకచెట్టుక్రింద బసచేయవలసివచ్చింది. ఎక్కడకువెళ్ళి బసచేదామన్నా ఆప్రదేశం క్రొత్తదే! అటు వంటప్పుడు ఎక్కడబసచేస్తే ఏమని, ఆచెట్టుక్రిందనే బస చేశారు, ఆవృద్ధదంపతులు తమ కూతురు చంద్రవదనతో కూడా! ఆచెట్టుచుట్టూ చక్కని నాపరాయిపరచిన అరుగు కట్టబడియుంది. అందుమీదనే ఆరాత్రికి పరున్నారు. అలా బసచేసిన ఆవృద్ధదంపతులు తమకుఒక్కగాను ఒక్కకూతురే అయిన చంద్రవదనను గురించి, 'చంద్రవదన వివాహంకు ఏం చేయడం-మనమా వృద్ధులమై పోయాము.- మనం గుటుక్కు మంటే యీపసికూన చంద్రవదనకు దిక్కెవరు?' అని ఏవో మాట్లాడుతున్న సమయంలో- ఎదురుగుండా రెండు తల్లి పక్షులు ఒకపిల్లా నేలమీద వరిగింజలు ఏరుకుతింటూ- అవీ- కడుపునపుట్టిన పిల్లపక్షినిగురించి- పిల్లచేసే చిలిపిగెంతులూ- కూతలూ వింటూ- ఎంతో ఆనందంతో మునిగివున్నాయి!

ఆలాటిసమయంలో అక్కడవున్న చంద్రవదనతండ్రి మాటలధోరణిలో క్రిందబెడ్డఒకటి తీసి అప్రయత్నంగా ఆ పక్షులువున్నవేపుకు విసిరాడు. చూడకుండా విసిరిన ఆబెడ్డ తిన్నగావెళ్ళి, మహానందంగా ఆవరిగింజలమడిలో తల్లిపక్షుల

ముందు ఆడుకుంటూన్న పిల్లపక్షికి తగిలింది. పాపం! ఆపసి కూన వెంటనే ఆదెబ్బకు ప్రాణాలు విడిచింది!

ఈ కడుపు శోకాన్ని భరించలేకపోయాయి, పక్షులు రెండూ!

ఇలా అనుకోకుండా జరిగినందుకు వృద్ధదంపతులు ఎంతో విచారించారు. కుమిలిపోయారు. అనుకోకుండా చేసిన హత్యకు చింతించారు.

ఎంత చింతిస్తేమాత్రం ఆపక్షులకడుపుశోకం తీరేది ఎలాగ?

ఇలా తమకడుపులో చిచ్చుపెట్టిన ఈ వృద్ధదంపతులకు కూడా కడుపుచిచ్చు జరిగితీరుతుందని ఆరెండుపిట్టలు ఏక కంఠంతో శపించాయి.

అప్పుడు ఆవృద్ధదంపతులు ఆపక్షులను కాళ్ళావేళ్ళా పడి 'ఓపక్షులారా! తెలియకుండా చేసినదానికి మమ్ములను క్షమింపగోర్తాము. మీకడుపుకు పెట్టినదుఃఖానికి మాకు తిరిగి ఆలాంటిశాపం యివ్వవద్దు. ఒక్కగాను ఒక్కకూతురు! మమ్ములను ఎలాగైనా కనికరించి రక్షించా' లని వేడుకున్నారు.

అందుకు 'సరే! మేము మిమ్ములను దయతలచి వదిలేస్తున్నాము. కాని ఈదేశంలో రాజు చాలాఉద్దండుడు. ఈ హత్యానేరానికి మిమ్ములను దండించకమానడు. అందుకు మీరు వెంటనే ఇక్కడనుంచి పారిపొండి' అని హితవుపలికాయి పక్షులు.

పక్షులుచెప్పిన సలహాకూ - కనికరించి వదిలేసినందుకూ ఎంతో సంతోషించి తిన్నగా అక్కడనుంచి పారిపోవడానికి సిద్ధపడ్డారు ఆవృద్ధదపంతులు!

కాని, అప్పటికి రాత్రిపడిపోయింది. దారి ఎటూ కానరావడంలేదు. అందుకు ఆప్రక్కనే ఒకచెట్టుక్రింద ఆరోజురాత్రికి విశ్రమించారు.

ఇలాగవుండగా అదేరాత్రి ఆదేశపురాజుగారు, ప్రక్కదేశపురాజుగారు గుర్రాలమీద ఎక్కడికో బయలుదేరి వెడుతూ ఆచీకటిలో ప్రయాణంసాగక వారూ అక్కడనే ఆరాత్రికి విడిదిచేశారు.

ఆదే దేశపు రాజుగారు ఎక్కివచ్చినగుర్రం ఆడది. ప్రక్కదేశంనుంచి ఎక్కివచ్చినరాజుగారిగుర్రం మొగది!-

ఆడగుర్రం పిల్లనుపెట్టగా ఆగుర్రపుపిల్ల వెళ్ళి పరాయిదేశపురాజుగారిమొగగుర్రంవద్దకు చేరుకుంది!

ఈగుర్రం యీనడం, ఆ పుట్టినపిల్ల వెళ్ళి పరాయి దేశపు రాజుగారిమొగగుర్రంకు దగ్గరలో పడడం, అంతా అందరూ నిద్రపోతూన్నసమయంలోనే జరిగిపోయింది.

తెల్లవారింది. తీరాచూస్తే పరాయిదేశపురాజుగారి మొగగుర్రంవద్ద ఒకగుర్రంపిల్ల వుంది. వెంటనే ఆదేశపు రాజుగారు ఆపిల్లను చూసి 'ఏమయ్యా! ఇది మాగుర్రం పెట్టినపిల్ల' అన్నారు.

'ఏడిసినట్లే వుంది! నాగుర్రందగ్గర నిలచివుందా, నీ గుర్రందగ్గర నిలచివుందా? అదేం వల్లకాదు. ఈగుర్రంపిల్ల

నాదే' అన్నాడు మొగగుర్రం స్వంతదారు అయిన పరాయి దేశపురాజు.

'అబ్బే! యిది చాలా అన్యాయంగా వుంది. ఎవరైనా వింటే నవ్విపోతారు, మొగదానికడుపున పిల్లపుడుతుందంటే! నాఆడగుర్రమే పెట్టింది ఆగుర్రంపిల్లను! కావాలంటే ఎవరినైనా అడిగి తెలుసుకోవయ్యా!' అన్నాడు ఆదేశపురాజు.

ఇలా వీరిద్దరూ ఒకరు అన్నది ఒకరుకాదని ఘర్షణ పడుతూంటే, నిద్రలో మునిగివున్న చంద్రవదనకీ - ఆవృద్ధ దంపతులకూ మెలకువ వచ్చింది! ఏమిటా ఈగొడవ, అని ఆగుర్రములు నిలుచున్నచోటుకు - ఆరాజులు వున్న ప్రదేశానికి వెళ్ళారు!

ఈప్రదేశంలో మనకువచ్చిన ఈపేచీలో న్యాయం చెప్పేవారే లేరే అని తికమకపడుతూన్న రాజుగారికి వీరిని చూడగానే మహానంద మైంది!

'రండి! మీకోసమే ఎదురుచూస్తున్నాము. ఈసమయంలో మీరు యిక్కడకు రావడం చాలాసంతోషంగా వుంది' అని వారిని మెచ్చుకొని ఆముసలివృద్ధునికి అక్కడ జరిగినసంగతి అంతా చెప్పారు, ఆయిద్దరురాజులూను!

'విడువుమంటే పాముకు కోపం, పట్టుమంటే కప్పకు కోపం'లాగ వుంది అక్కడ పరిస్థితి! ఇటుచూస్తే అదే దేశపు మహారాజుగారు ఒకాయన! అటువెంపు చూదామంటే ప్రక్కదేశపుమహారాజుగారు మరొకాయన!

'రాజులూ రాజులూ కొట్టుకొంటూంటే - పొట్టేళ్ళ మధ్యన మేకపిల్లలాగ-మనం ఎందుకు ఈసంఘర్షణలో చిక్కు

కోవడం? ఎలాగరా భగవంతుడా తప్పిపోతే బాగుండును' అనుకొని చాలాబాధపడసాగాడు ఆవృద్ధు! ఆసంగతి అంతా కనురెప్పవాల్చకుండా పరికిస్తూంది చంద్రవదన!!

ఇద్దరురాజులూ వారివారివిషయాలను నివేదించి 'రేపు యీపాటికి యీవిషయంలో నీవు సరిఅయిన అభిప్రాయం యివ్వాలి? అలాయివ్వకపోయావా నీమెడ చెట్టుకుకట్టి ఉరి తీయబడుతుంది' జాగ్రత్త అన్నాడు రాజు. ఆమాటలకు గజ గజ వొణికిపోయారు ఆవృద్ధుడూ, భార్యా, కూతురు చంద్ర.

అలా హెచ్చరించి రాజు - పరాయి దేశపురాజు వెళ్ళిపోయారు.

ఈఅగ్నిగుండంలో వచ్చి చిక్కుకున్నాము ఎలాగరా తప్పించుకోవడం అని వృద్ధుడూ, - తనభర్తకు ఏం కానుందో అని భార్యా దుఃఖించసాగారు!

ఈసమయంలో చంద్రవదన తల్లిదండ్రులకు ధైర్యం చెప్పి 'ఈవిషయంలో మీరు అధైర్యపడకండి! మనకువచ్చిన నష్టం ఏంలేదు! దీనికి మంచిఉపాయం నేను ఆలోచిస్తాను' అని ఓదార్చింది.

చంద్రవదనమాటలకు కొంచెం ధైర్యంచెంది తల్లిదండ్రులు కొంచెంమనశ్శాంతితో వున్నారు.

రాత్రి పడింది. వృద్ధదంపతులు అదే చెట్టునీడను ఆలోచిస్తూనే పాపం నిదురించారు. చంద్రవదన మాత్రం రేపు వుదయం ఏమిసమాధానం చెప్పి తనతండ్రిని రక్షించుకోవడమా అని ఆలోచిస్తూనేవుంది. ఇలా మంచిఆలోచనలో

మునిగివున్న సమయంలో కొంతమంది రాజభటులు అశ్వారూఢులై వచ్చి తమను చుట్టుముట్టారు.

ఇలా తమను హఠాత్తుగా చుట్టుముట్టిన ఈభటులను చూసి చంద్రవదన హడలిపోయింది. శరీరం ముచ్చెమటలు పోసింది. తననుతాను సముదాయించుకొని, భయపడుతూన్న కంఠంతో 'ఎవరు మీరు? ఎందుకు వచ్చారు?' అని ప్రశ్నించింది.

'మేము ఈ దేశపు రాజభటులము! మిమ్ములను బంధించి జైలులో పెట్టడానికి వచ్చాము' అని అధికార స్వరంతో గర్జించారు భటులు!

ఈ మాటలను విని భటులను 'ఏమిటి ఇది? ఏం నేరం చేశాము? మమ్ములను ఈవిధంగా బంధించడం న్యాయంగావుందా?' అని అడిగింది. ఈమాటలకు ప్రక్కనే నిద్రపోతూన్న వృద్ధతల్లిదండ్రులు ఉలిక్కిపడి ఏమిటో అని లేచారు. ఒక వెంపున తమను చుట్టుముట్టిన భటులను, వేరొక వంక వారితో ఘర్షణపడుతూన్న తమకూతురు చంద్రవదనని చూసి ఏం ముంచుకొచ్చిందో అని భయపడసాగారు!

'నీమాటలు కట్టిపెట్టి నీతలిదండ్రులతోసహా రాజుగారి కోటకు నడు. అలా నడవకుంటే మిమ్ములను బలవంతంగా లాక్కుని వెళ్ళవలసివుంటుంది' అని హెచ్చరించారు!

అసలుసంగతేమిటో తెలియనితండ్రికీ, తల్లికీ ఇది చూస్తుంటే చాలా అగమ్యగోచరంగా కనుపించసాగింది?

'ఏమిటి! మీరు మమ్ములను యిలా చుట్టుముట్టడానికి గల కారణము? మేము ఎక్కడా దొంగతనం చేయలేదే-

ఎక్కడా రాజ్యధిక్కరణకు గడంగలేదే- ఎవరినీ హత్యచేయ లేదే? అటువంటిమమ్ములను యిలా నించున్నపళాన బంధించి జైలుకు నడవమనడం ఏం న్యాయం? విషయం ఏమిటో చెప్పండి. నాకు ఒక్కగాను ఒక్కకూతురు. నాకూతురును ఏమీ అనకండి. ఏదైనా నేరంవున్నయెడల నేనే వస్తాను' అని ప్రాధేయపూర్వకంగా అడిగాడు తండ్రి.

తండ్రిమాటలకు రాజభటులనాయకుడు కొంచెం కని కరించి 'సరే! విషయం ఏమిటో మీకు చెబుతున్నాను. మీరు చేసింది దొంగతనమూ కాదు, రాజధిక్కరణా కాదు. కాని సహించరాని హింస! మీమీద హత్యానేరం ఆరో పించబడింది. కనుక మిమ్ములను రాజాజ్ఞప్రకారం బంధించి, మీకు న్యాయస్థానం నిర్ణయించినప్రకారం శిక్షవిధించ నున్నాము' అని సెలవిచ్చాడు!

ఈ మాటలు విన్న తల్లిదండ్రులు గజగజ వణికి పోయారు. చంద్రవదన భయంతోపాటు ఇలా తమమీద అన్యాయంగా నేరం మోపి బంధిస్తూన్నందుకు లోలోపల కోపంతో కుమిలిపోయింది!

'ఏమిటి మేము చేసినహత్య?' అని ప్రశ్నించింది, తిరిగి చంద్రవదన!

'ఒకకుటుంబం మహానందంగా తమదారిన నడుచు కొంటూంటే నిలువునా వారితలిదండ్రులకళ్ళముందరే వారి కన్నపిల్లను చంపారు. చంపడమే కాకుండా ఆనేరం దాచి, మీరు పారిపోదామని ప్రయత్నించారు. ఆవిషయం మా రహస్యభటదళం కనిపెట్టానే వుంది. పాపం చీకటిగావుందని

ఈనాటికి యిక్కడనే విశ్రాంతి దిగారు' అన్నాడు గంభీరంగా భటుడు!

సహించలేకపోయింది ఈమాటలకు చంద్ర. ఈమాట వింటూ ఒణికిపోయారు తల్లిదండ్రులు.

'మేము ఎక్కడా, ఎవరినీ హత్యచేసి ఎరుగమే? చెప్పండి ఎక్కడ - ఎవరిని హత్యచేశామో?' తిరిగి బొంగురు పోయిన కంఠంతో అడిగింది చంద్ర!

'హుఁ! నీకు వివరాలన్నీ కావాలా! జాగ్రత్త! కోపం వచ్చిందంటే కొరడాదెబ్బలు తినవలసి వుంటుంది' అని హెచ్చరించాడు భటుడు!

'నాకు భయంలేదు కొరడాదెబ్బలు కొట్టేందుకు మీన్యాయశాస్త్రం ఒప్పుకొంటుందా? నేరం చెప్పకుండా అమాయకులను బంధించడం న్యాయమేనా? ఎవరు, మీ రాజు? నడవండి' అని అతిధైర్యంగా నిలవేసి అడిగింది చంద్ర!

ఏ మనుకున్నాడో ఏమో భటనాయకుడు మీనేరం చెబుతున్నాను అన్నాడు.

చెవులు నిక్కించి వినసాగారు తల్లిదండ్రులూ, చంద్రా!

'మీరు యీప్రక్కగావున్న ఒకతోటలో అభంశుభం ఎరుగని పక్షిజంట తనకడుపునపుట్టినపిల్లపక్షి ఆటలను చూస్తూ మహానందంగావున్నసమయంలో మీరు ఆపిల్లని చంపివేశారు. ఆసమయంలో మిమ్ములను కనిపెట్టిన మా రహస్యభటుడు వెంటనే యీవార్తను మాకు అందించాడు. మారాజాజ్ఞప్రకారం దేశంలో ఎవరైనా పక్షులనుగానీ,

చెట్లనుగానీ, జంతువులనుగానీ హింసించారా అది హత్యా నేరంక్రిందికే వస్తుంది. ఆనేరంకు మాన్యాయశాస్త్రంలో ఒకశిక్ష వుంది. అది చిత్రవధ' అన్నాడు.

'అయ్యబాబోయ్! చిత్రవధా?' అంది తల్లి!

'మమ్ములను చిత్రవధచేస్తారా' అని భయపడుతూ అరిచాడు తండ్రి!

ఈమాటవిన్న చంద్ర చాలాభయపడిపోయింది. అయినా కొంచెంధైర్యం చెప్పుకుని 'అయితే పక్షులకే యింతగౌరవము యిచ్చే మీరాజు మనుష్యులకు ఎంతగౌరవం యిస్తారు?' అని అడిగింది.

ఈమాటలకు మరీకోపం వచ్చింది భటులకు! వెంటనే ముగ్గుర్నీ తీసుకొని వెళ్ళిపోయారు!

   

రాజులకు యిద్దరిమధ్యనా గుర్రంపిల్ల వల్లకదూ తగాదా వచ్చింది?

ఆ తగాదాకు అక్కడనేవున్న చంద్రవదన తండ్రిని కదా వారు న్యాయంచెప్పమని అడిగింది. అందుకు వారు మరునాడు వుదయంవరకు గడువుయిచ్చారుకదూ! ఆ గడువు కాస్తాపూర్తి అయిపోయింది!

వెంటనే రాజుగారు మంత్రిని పిలిచి, 'మంత్రీ! నిన్నను జరిగినసంగతి నీకు తెలిపియున్నాను! ఆ చెట్టుక్రిందవున్న ముగ్గురూ గుర్రంపిల్లవిషయంలో సాక్ష్యమివ్వడానికి వస్తుకు తీసుకరమ్మని భటులను పంపించు' అని చెప్పాడు.

మంత్రి తిన్నగా చంద్రనూ, తల్లిదండ్రులను బంధించి తీసుకురమ్మని భటులను పంపించాడు.

రాజాజ్ఞప్రకారం భటులు వచ్చారు. కాని అక్కడ చంద్రకాని, తల్లిదండ్రులుకాని కనిపించలేదు. ఆ చుట్టుప్రక్కల ఎక్కడైనా దాక్కున్నారేమో నని వెదికారు. కాని ఎక్కడా వారికి దొరకలేదు.

నిరాశచెందిన భటులు తిన్నగా కోటకు బయలుదేరి వెళ్ళి, రాజుకూ, మంత్రికీ, ఎక్కడా దొరకలేదనీ, వారిజాడ ఏమీ అంతుచిక్కలేదనీ చెప్పుకున్నారు.

ఈ మాటలు విన్నరాజు 'ఏమిటి ఈ అన్యాయం? మసలనుంచి ఎలా తప్పించుకుపోయారు? మరి ఈసమయంలో మనకు న్యాయంచెప్పాలంటే కోర్టులుకాదుకదా! నేను ఏదైనా చెప్పినా ఎదుటిరాజుగారు అంగీకరిస్తారనే నమ్మకం ఎక్కడుంది?' అనుకుంటూ చాలాబాధపడ్డాడు రాజుగారు. 'ఏంచేయడమూ?' అని మంత్రి ఆలోచించసాగాడు.

అసలు వీరిని బంధించింది ఈదేశ ప్రరాజుభటులే! కాని ఈ చిన్నహత్యానేరాలను సంబంధించిన వార్తలు రాజుకు, మంత్రికి తెలియచెయ్యరు. పట్టుకున్నభటులే తిన్నగా జెయిలులో పడేసి కోర్టుకు కేసు అందిస్తారు. కోర్టువారు విధించేశిక్షను అమలుపరుస్తారు!

ఇలా యీముగ్గురూ తమభటులచే హత్యానేరమూ పాదింపబడి, జైలులో బంధించబడినట్లు రాజుకిగాని, మంత్రికి గాని తెలియదు. 'ఏం చేయడం! పర్రాయిదేశంరాజు వస్తే

ఏం సంజాయిషీ యివ్వడం?' అనుకుంటూ ఆలోచించసాగాడు రాజూ, ప్రక్కనే మంత్రీను!

అంతలోనే పరాయిదేశపురాజుగారు వచ్చారు!

రండి, రండి అని స్వాగతంపలికి లోపలికి తీసుక వెళ్ళారు. కొంతతడవు విశ్రాంతితీసుకొనినతరువాత 'ఏరీ! చెట్టుక్రింద మనగుర్రంను చూసినసాక్షులు? ప్రవేశపెట్టండి. కేసును నడిపిద్దాము' అన్నాడు రాజు!

ఏమి చెప్పడానికీ నోరాడలేదు, అటు రాజుగారికీ ఇటు మంత్రిగారికీ!

రాజుగారు మంత్రిముఖంకేసీ, మంత్రిగారు రాజుగారి ముఖంకేసీ - అక్కడచేరివున్నపరివారం అందరికేసీ చూస్తూ మౌనంగా వున్నారు.

ఎంతసేపని అలాంమౌనంగా వుంటాడు? ఈ మౌనంగా వున్న పరిస్థితిచూస్తున్న పరాయిదేశపురాజుగారికి చాలా ఆశ్చర్యంగా కనపడింది. ఉండబట్టలేకపోయాడు!

'ఏమిటీ-అలాఆలోచిస్తూ మౌనంగావున్నారు? గుర్రం పిల్ల నాదనేనా మీ మౌనానికి అర్థం?' అని అడిగేశాడు పరాయిదేశపురాజు.

ఉలిక్కిపడి మహారాజు, 'అయ్యా, చిన్నతప్పిదం జరిగిపోయింది. మాకు తెలియకుండగా మాదేశంనుంచి ఆముగ్గురూ పారిపోయారు. అందుకు చాలావిచారిస్తున్నాము. అందుకే ఈ మౌనం! కాన ఈ విషయంలో మమ్ములను మరోలా భావించవద్దని కోరిక' అన్నాడు.

'అయితే ఎలాగ?' అని అడిగాడు పరాయిదేశపు రాజు.

'ఏముందీ? కోర్టువారికి ఈకేసు అందజేదాము' అన్నాడు మంత్రి!

'అబ్బే! అలా వీలుకాదు' అన్నాడు పరాయిరాజు.

'ఏం చేదా మంటారు' నిదానంగా అడిగాడు రాజు.

'ఏం చేయడం? ఆ మనుష్యులను నాకు అనుకూలంగా సాక్ష్యం యిస్తారని అనుమానించికదా మీరు దాచివేశారు! అలాగే గుర్రంపిల్లకూడా పారిపోయిం దని చెప్పండి. సరి పోతుంది.' ఉగ్రరూపంతో చెప్పి, కళ్లారాచూసిన ఆముగ్గిరిలో ఏఒకరినిఅయినా సాక్షిగా తీసుకురండి. అలా తీసుకురారా ఇందులో మీకు ఏదోపాత్ర-ఈవిషయానికి వెనుక ఏదోకుట్ర వున్నట్టే! అయినా మీరు చేయు యీకుట్రకు సమాధానం ఏనాటికైనా చెప్పవలసివుంది' అంటూ తిన్నగా అక్కడ నుంచి వెళ్ళిపోయాడు పరాయిదేశపురాజు.

ఇలా పరాయిరాజువద్ద మాటబోటుపోయినందుకు—మాటదక్కించుకోలేకపోయినందుకు-రాజుగారు చాలా చిన్న బుచ్చుకున్నారు. మంత్రికి ఏంచెప్పాలో తోచక గుడ్లు మిటక రిస్తూ రాజుముఖంకేసి చూస్తూ కూర్చున్నాడు.

ఇంతవరకూ ప్రక్కవారిలో ఏంఅపవాదు పొంది ఎరుగని రాజుగారు - ఈనాడు ఇలా మాటదక్కనందుకు చాలాచిన్నబుచ్చుకుని - మనస్సులోపల అదేపనిగా కుమిలి పోసాగాడు.

ఇలా రాజుగారు మనస్సులో కుమిలిపోతూ నిరుత్సాహంగావుండడంచూసి రాణీ, మంత్రీ, పరివారమూ చాలా బాధపడసాగారు.

♦ ♦ ♦ ♦

చంద్రవదననీ, తల్లినీ, తండ్రినీ అరెస్టుచేసినారుకదూ రాజభటులు !

అలా అరెస్టుచేసి తిన్నగా తీసుకునివెళ్ళి బందిఖానాలో బంధించి విచారణ ప్రారంభించారు.

ఈ విచారణతోను, విషయసేకరణతోను వాయిదాలమీద వాయిదాలువేస్తూ చాలా ఆలస్యంచేస్తున్నారు - న్యాయస్థానంవారు !

అలా వాయిదాలమీదవాయిదాలు జరిగిపోతున్నాయి. ఇది యిలావుండగా జైలులో భటులు చంద్రను, తల్లిదండ్రులను అమాయకంగా హింసించి వారి అధికారాన్ని నిరూపించుకొనసాగారు.

రానురాను వారిబాధలు మితిమీరిపోయి, సహించలేనిస్థితిలో పడ్డాయి !

ఇక మనం వూరుకుంటే లాభంలేదనుకొంది చంద్రవదన !

ఏవిధంగా ఈప్రమాదంనుంచి తప్పించుకోవడం అని ఆలోచింపసాగాడు తండ్రి !

ఏమిరా ! పరాత్పరా ! మమ్ములను యిలా హింసించుకు తినడానికి ఏం అన్యాయం చేశాము - అని దేవుని ప్రార్థిస్తూ కుములసాగింది తల్లి !

ఈవిధంగా ఎవరిమట్టుకు వారు ఆలోచిస్తూ రోజులు గడుపుకువస్తున్నారు !

ఒకరోజురాత్రి మంచినిద్రలో మునిగివుంది చంద్రవదన. ఎక్కడనుంచో రామచిలుకమాటలూ - పలుకులూ వినిపించసాగాయి.

రానురాను ఆమాటలూ పలుకులూ ఎక్కువగా బిగ్గరగా వినిపించసాగాయి! నిద్రలోమునిగివున్న చంద్రకు మెలుకువవచ్చింది. ఏమిటా ఈధ్వని అనుకుంటూ జైలు లోపల నాలుగుమూలలా కలయతిరిగింది. కాని యెక్కడా ఏమీ కనుపించలేదు.

'చాలా విచిత్రంగా వుందే? పడుకున్నసమయంలో ఏవోమాటలు వినిపించాయి. తీరాచూస్తే ఆమాటలు లేవు. ఇదంతా మాయగా వుందే' అనుకొంది చంద్రవదన !

తిన్నగావెళ్ళి తిరిగి తనపక్కమీదపడుకుంది. కొంతసేపు నిశ్శబ్దంగా గడచిపోయింది. చంద్రకు నిద్రపట్టబోతూంది. ఇంతలో తిరిగి ఆ చిలుకపలుకులూ మాటలూ వినిపించసాగాయి !

ఈసారి మరీఆశ్చర్యం వేసింది చంద్రకు ! తిరిగి తిన్నగా నాలుగుమూలలాచూస్తూ పరీకించసాగింది. అప్పుడూ ఏం అగుపించలేదు. 'ఛీ ! ఇదేదో భూతాలజైలులాగ వుంది. పడుకుంటే మాటలు వినిపిస్తాయి. తీరా వెతకవస్తే మాటలూ వుండవు, ఏమీ వుండవు. ఏమిటి చెప్మా?' అని విసుక్కుని ఇక 'ఏమైనాసరే! పక్కమీదనుంచి కదలిరాకూడదు'

అనుకొని వెళ్ళి పడుకోబోయింది. ఇంతలో జైలుగోడకు వున్న ఒక యిటుకరాయిలోంచి చిలుకపలుకులు వినిపించ సాగాయి.

ఆశ్చర్యంగావుందే గోడలోంచి ఈవిధంగా విని పిస్తూంది ఏమిటి? అనుకుంటూ తిన్నగా అక్కడకు వెళ్ళింది.

గోడలోపల సంభాషణ వినిపిస్తూంది. ఏం చేయడం? ఈసమయంలో అమ్మనూ నాన్ననూ లేపుదామా? అబ్బో! మంచినిద్రలో వున్నారు. వాళ్ళను ఎందుకు అనవసరంగా లేపడం అనుకొంది. అక్కడనేవున్న ఊసముక్కను సంపా దించింది. ఆవూసతో మెల్లగా ఆరాయిని తొలవసాగింది. అలా తొలవగా, తొలవగా - యిక కొంచెంసేపట్లో తెల్ల వారనుందనగా - గోడకువున్న రాయి కూలి కిందపడింది. ఆ కన్నంలోంచి చూస్తే చాలాభయంకరంగా ఒకరంధ్రం కనుపించింది. తల దగ్గరగాపెట్టి పరికించసాగింది చంద్రవదన.

చూస్తూంటే అందులో ఒకచిలుక ముందుకు పరుగె త్తడం కనుపించసాగింది.

ఏమిటో లోపలకువెళ్ళి సంగతి పరికిద్దాం అన్న ఉబ లాటం కలిగింది చంద్రకు.

కాని, ఎలాగ అందులోకి ప్రవేశించడం? ప్రవేశించా లంటే రంధ్రం యింకా పెద్దది చేయాలి! అయినా ప్రయ త్నించిచూదా మనుకొని గట్టిగా యిటుకను తొలవసాగింది. అలా తొలవగా తొలవగా అలిసిపోయి, అక్కడక్కడే, స్పృహఎరుగకుండా ఆప్రదేశంలోనే పడిపోయింది.

ఉదయంఅయి తల్లీ తండ్రీ కూతురు పక్కన కనుపించకపోయేటప్పటికి బేజారుపడిపోయి, గుండెలను బాదుకుంటూ నాలుగుమూలలా పరుగెత్తారు. ఒకచోట స్పృహలేకుండా పడివుండడాన్ని చూసి, వణుకుతున్న కాళ్ళతో కంపిస్తున్న చేతులతో కూతురును లేవనెత్తారు. ప్రక్కన యిటుక ముక్కలూ, యినుపవూస పడివుండడంచూసిన తల్లిదండ్రులు ఏమిటో అర్థంగాక ఒణికిపోతూ ఏంకీడు రానున్నదో అని తలచుకొని తిన్నగా పక్కమీదకుతీసుకు వెళ్ళి పరుండబెట్టారు.

ఇక భటులువచ్చేసమయంకూడా అవవస్తూంది. ఏం చేయడం? అక్కడ ఇనుపవూస - యిటుకలు చూస్తే ఏం అనుకుంటారో? అని బేజారుపడుతూ పరిచర్యలుచేస్తూ చంద్ర పక్కనే కూర్చున్నారు.

అలా కొంతసేపు వున్నతరువాత కొంచెం తెప్పరిల్లింది చంద్ర.

ఇదేసమయానికి కోటలో గంటలు కంగుకంగుమంటూ మ్రోగాయి. ఈ గంటలు మ్రోగగానే జైలులోపలివారిని భటులువచ్చి యినతలకుతీసి గంజియిస్తారు.

ఈ సమయంలో భటులువస్తే ఏంచేయడం? ఎలాగా ఈగండంనుంచి తప్పించుకోవడం అనుకుంటూ భయపడసాగారు తలిదండ్రులు!

ఇంతలో చంద్రకు పూర్తిగా మెలుకువ వచ్చింది. గాబరాపడిపోతూ తను కన్నంకొట్టినచోటుకు పరుగెత్తింది. ఏమిటా అని వారుకూడా వెనుకనే అనుసరించారు.

వెంటనే భటులువచ్చేసమయం అయిపోయింది. 'ముందర ఈకన్నానికి అడ్డు ఏదైనా పెట్టండి. విషయం తర్వాత చూసుకొందాం' అని చెప్పింది చంద్ర.

ఆప్రకారమే అక్కడ కన్నంకనుపించకుండా కప్పేశాడు తండ్రి! ఇంతలో భటులు అక్కడకు రావడంకూడా జరిగింది. కాని వారికంట ఈవిషయంపడకుండా తప్పించుకో కలిగినందుకు చాలా సంతోషపడిపోయారు తల్లీదండ్రులు. కొంతలోకొంత విజయంపొందినందుకు గర్వపడసాగింది చంద్ర.

ఆరోజు ఎలాగయితేనేం గడిచిపోయింది. తిరిగి ముగ్గురినీ జైలులోకి తోసి గదికి తాళంవేశారు.

రాత్రి పడింది. 'ఏమే చంద్రా! విషయం చెప్పుమాకు. చాలాభయంగా వుంది. ఏ మవుతుందో' నని అడిగారు తలిదండ్రులు చంద్రని.

'అబ్బే! ఏం లేదు. నేను అలావెళ్ళగా అక్కడ ఊస కనుపిస్తే అలాకొట్టాను. ఇటుక కూలిపడింది' అని అసలు విషయం చెప్పకుండా మార్చేసింది.

'ఏమో! ఏమిటో చెబుతోంది. అయినా ఆ విషయంతో అమ్మాయిని ఎందుకు విసిగించడం?' అనుకొని చంద్రను పక్కనే పరుండబెట్టుకుని నిద్రపోయారు, తల్లిదండ్రులు!

చంద్రకూడా నిద్రపోయినట్లుగానే నటించిందిగాని, నిద్రపోలేదు. తల్లిదండ్రులు ఎప్పుడు నిద్రపోతారా, తిరిగి ఆ

కన్నంవద్దకు వెళ్ళి అసలుసంగతి ఎప్పుడు చూదామా అని ఎదురుచూడసాగింది చంద్ర.

తల్లిదండ్రులు నిద్రపోవడంగమనించి, తిన్నగా పక్క మీదనుంచి లేచి, ఆకన్నంవద్దకు వెళ్ళింది. అడ్డుఅన్నీ తొలగించింది. తిరిగి ఊసపెట్టి కన్నాన్ని పెద్దదిచేసి అందులోకి ప్రవేశించింది.

అలా ప్రవేశించినచంద్రకు కొంచెం భయం వేసింది. వెనుకకు తిరిగి చూసింది నిద్రిస్తున్న తల్లిదండ్రులనుచూసి కంట నీరు పెట్టింది. అయినా భయంతోనూ బెంగతోనూ బెదరి యిక్కడనిలస్తే లాభంలేదనుకొని తనకుతాను ధైర్యం తెచ్చుకుని తిన్నగా ముందుకు నడక సాగించింది.

ఇంతలో ఒకదారి కనుపించింది. ఏమిటా ఈ దారిఅనుకొని యింకాముందుకు నడిచివెళ్ళింది. అలా వెళ్ళగా వెళ్ళగా ఒకచోట రాతితోకట్టబడినమెట్లు కనుపించాయి. ఆమెట్లను ఆధారంచేసుకొని నడచివెళ్ళింది. అంతలో ఒకచోట ఒకద్వారం కనుపించింది. కాని ఆద్వారం మూసివుంచబడింది. ఏం చేస్తుంది చంద్రవదన!

ఎంతసేపో గుంజింది. కాని ద్వారం రాలేదు. అయ్యో! యింతదూరం యిలా తెగించి తల్లిదండ్రులను వదిలి వారికి భటులప్రమాదం ఉంటుందని తెలిసికూడా వచ్చేశానే! ఈ సమయంలో యిలా జరిగింది. ఏంచేయడం అనుకుంటూ అక్కడనే చతికిలబడి అదేపనిగా ఆలోచించసాగింది.

* * * *

ఉదయం అవగానే యథాప్రకారం కోటలోని గంటలు గణగణా మ్రోగాయి. చంద్రతల్లిదండ్రులు లేచారు! తీరా చూసుకుంటే తనమద్దులగుమ్మ చంద్ర పక్కలో కనుపించ లేదు ఏమైందోనని హడలిపోతూ నిన్నను ఒక చోటకన్నం వద్ద పడివుందికదా! అక్కడనే వుండేమోనని తిన్నగా ఆతృతతో అక్కడకు పరుగెత్తారు.

అక్కడ కనుపించకపోయేటప్పటికి గుండెలు బాదుకుంటూ 'అయ్యో! చంద్రా! ఎక్కడికి వెళ్ళావమ్మా? నీ కెంత కష్ట మొచ్చింది తల్లీ!' అంటూ ఆకన్నంవద్దపడి తల నేలను బాదుకుంటూ భోరుభోరున ఏడ్వడం మొదలుపెట్టారు.

'ఏమై వుంటుందో అమ్మాయి? ఎటూ వెళ్ళడానికి దారిలేదుకదా! నాకు ఒకఅనుమానం. ఈకన్నంలోనుంచి ఎటువెంపుఅయినా వెళ్ళిందేమో? అభంశుభం తెలియని చంటిది. మీరుకూడా ఈకన్నం వెంటేబయలుదేరి వెళ్ళి నా చంద్రను పట్టుకురండి' అని ఏడుస్తూ అడిగింది తల్లి.

'ఈకన్నం వెంటనే వెళ్ళివుంటుంది. నిన్ననే ఈకన్నం వద్ద వుంది. కాని నాకు దానిమాటలుచూస్తే అనుమానం ఏం కలుగలేదు. ఇప్పుడు నీమాటలు చూస్తే నాకు యీకన్నంలో నుంచే వెళ్ళివుంటుం దనే అనుమానం కలుగుతోంది' అని చెప్పి 'సరే! మరినేనుఅమ్మాయికోసం ఈకన్నం వెంట బయలు దేరి వెడతాను. కానీ, భటులువచ్చినిన్ను 'నీభర్త, కూతురు ఏరి?' అని అడిగి, ఈకన్నంచూసి, నిన్ను కొట్టి చంపుతారేమో నని నాకు భయంగావుంది. ఏం చేయడం!' తన భయాన్ని వ్యక్తపరిచాడు భర్త.

'అయినా సరే! నేను ఎలాగో అలాగ బాధలు పడతాను. ఎన్నిబాధలకైనా ఇష్టపడగలనుగాని అమ్మాయిని విడిచి వుండలేను వెళ్ళండి.' తిన్నగా కన్నంవద్దకు తీసుకు వచ్చింది. కన్నంలో ప్రవేశిద్దాం అనుకుంటూండగా రాజ భటులు తలుపులుతీసి కన్నంలోప్రవేశించబోవడం చూశారు!

అలాచూసిన భటులకు చాలాకోపం వచ్చింది. 'మమ్మలనే యిలా మోసంచేదా మనుకుంటున్నారా? చూడండి ఏం చేస్తామో?' అని గదమాయించి ఆకోపంలో వెంటనే అసలు ఆకన్నం ఏమిటి? ఎక్కడికి వెడుతుందీ అనే ఆలోచనైనా లేకుండా గుడ్డిగా తాపీవారిని రప్పించి వెంటనే కన్నం మూయించేశారు. అక్కడనుంచి వేరేగదికి తండ్రిని, తల్లిని తీసుకుపోయి బంధించారు.

అయ్యో! అమ్మాయి ఆకన్నంలో దూరివుండగా కన్నంమూసివేశారు. ముందరచెప్పినా బాగావుండేది. ఇక మనం బ్రతికివుండి లాభం ఏమిటి? ఎవరికోసం? అని తల్లి దండ్రులుఅలా ఏడుస్తూ, కూతురు చంద్రవదనకోసం దుఃఖిస్తూ కృశించసాగారు. తిండిగాని, నీరుగాని తాగకుండా బెంగతో రోజురోజుకూ నీరసించిపోయారు.

ఇక్కడ తల్లిదండ్రులు బాధపడుతుండగా ఆ సొరంగంలో ఇనుపగేటురాక ఎంతో విసిగివేసారి ఎటూదారిగానక యిక చేయునది ఏమీలేక తిరిగి తన తల్లిదండ్రులువున్న గదిలోపలకు వద్దామని పరుగుపరుగున సొరంగం గుండా వచ్చింది.

తీరాచూస్తే సొరంగంలోనుంచి గదిలోకి త్రవ్వబడిన చోట బలంగా పూడ్చిపెట్టబడి వుంది.

అక్కడేపడి, 'అమ్మా! నాన్నా!' అంటూ అదే పనిగా అరచిఅరచి సొమ్మసిల్లిపోయింది చంద్రవదన.

తినడానికి తిండిగాని, త్రాగటానికి నీరుగాని దొరకలేదు. ఆకలి యెక్కువవుతోంది. ఏంచేయడం? ఆలాగే తిరిగి వెనుకకు వెళ్ళింది. వెళ్ళివెళ్ళి ఆ యినుపగేటువద్దకు వెళ్ళింది. తీరా చూస్తే ఆతలుపు తెరచివుంది.

చాలా ఆశ్చర్యపడిపోయింది చంద్రవదన. ఇందాకటి నుంచీ ఎంతప్రయత్నించినా తలుపులు రాలేదు. ఇప్పుడు దానంతటదే తెరుచుకొనివుంది. ఇదేదోవింతగా కనుపిస్తోందో అనుకొని మహాసంతోషంతో గేటుదాటి ముందుకు వెళ్ళింది.

అలా వెడుతూంటే చివరకు ఒకపచ్చనినేల కనుపించింది. ఆకాశాన సూర్యుడు తళతళ మెరుస్తున్నాడు. ఆ పచ్చనినేలలో లేగలు మేస్తున్నాయి. చూస్తూంటే ఆదృశ్యం చాలా మనోహరంగా కన్నులపండువుగా వుంది. అలా ఆ దృశ్యాలను చూస్తూ ముందుకు నడిచింది. అలావెడుతూంటే ఒకచెట్టునీడన ఒకగుంపు కనుపించింది. ఆ గుంపులోనివారు చూడడానికి మహాభయంకరంగా ఆజానుబాహువులుగా నున్నారు. పెద్దపెద్ద మీసాలూ, కుంకంబొట్లూ, మెళ్ళో పూసలదండలూ చూస్తూంటేనే కళ్ళు మిలమిలలాడి, గుండె అదిరిపోయేలాగ వుంది.

వీరినిచూసి చాలా భయపడిపోయింది చంద్రవదన.

లేగలన్నీ యిళ్ళకు తిరిగిపోతున్నాయి. లేడిపిల్లల పరుగులు కనుమరుగైపోతున్నాయి. అస్తమయభానుడు విశ్రాంతికి సన్నాహాలు చేస్తున్నాడు. పక్షుల కిలకిలారావాలు ఎక్కువగావున్నాయి. చూస్తూనే వుంది చీకటి నేలంతా అలముకోనడం. ఎటూ కనుపించడంలేదు. అలువంటి కొత్త ప్రదేశంలో భయంకరమైనఅడవిమధ్యలో ఒక్కతే వుండడం, చాలా బాధగానే వుంది. అందుకు సాయం అంతక్రితమే ఒక భయంకరదృశ్యం కనులపడింది. ఆగుంపు వదొంగలో అయి వుంటారని తలచుకొని, వీళ్ళు మనలను చూస్తే చంపేస్తారు. ఎలాగు తప్పించుకోవడం అని తలచి, గబగబా ఆ చీకటి లోనే ఎక్కడికో పరుగెత్తుకుని, అలా వెళ్ళడంలో ఒకచోట ఒక వేటకుక్క చూసి వెనుకనే అరుచుకుంటూ తరుముకొచ్చింది. ఆకుక్క తనను కరుస్తుంది అనే ఆత్రుతతో అదేపనిగా పరుగెత్తసాగింది చంద్రవదన.

ఎంతపరువెత్తినా లాభంలేకపోయింది. చివరకు ఆ కుక్క తిన్నగా చంద్రను అడ్డంకొట్టి మెడమీాద కాళ్ళుపెట్టి అదేపనిగా మొరగడం ప్రారంభించింది. ఆకుక్క అరుపుకు ఆదొంగలముఠాఅంతా ఒక్కసారి బిలబిలా ఆయుధాలు ధరించి బయలుదేరారు.

ఆకుక్క వారికోసం కాపలావుంచుకున్నకుక్క! దొంగ లను పట్టడానికి. ఎవరైనావస్తే ఆ కుక్క అరచి శత్రువుల రాకను చూపిస్తుంది. అంతే. వెంటనే ఎక్కడిదొంగలు అక్క

-డికి పారిపోవడమో, ధిక్కరించి పోరాడడానికి ఆయుధాలు ధరించి ఎదురుగుండా రావడమో జరుగుతుంది!

ఎప్పుడైతే కుక్క మొరిగిందో వెంటనే నాలుగు మూలలనుంచీ చుట్టూ ముట్టేశారు చంద్రవదనను! ఇంతా చేస్తే ఎవరూ లేరు, ఒక్క చిన్నిపిల్ల చంద్రతప్ప. ఈమాత్రం దానికేనా యింతల్లా అరచావని కుక్కను కేకవేసి, అయినా ఈఆడపిల్ల యింతరాత్రివేళ మనరహస్యస్థావరంలోకి రావడానికిగల కారణం ఏమిటి? ఇందుకు ఏదో ఒకకారణం వుంటుంది? అనుకొని, తిన్నగా ఒణికిపోతూ నిలుచున్న చంద్రను దొంగలు తమ రహస్యస్థావరానికి తీసుకుపోయారు. 'మొర్రో! మొర్రో!' అని ఎంతఏడ్చినా దిక్కెవరు? తీసుకుపోయి ఒక్క చెట్టుతొర్రలో పడేసి, తలుపు బిగించేశారు!

బిక్కుబిక్కుమంటూ ఆచీకటి చెట్టుతొర్రలో ఏడుస్తూ అలాగే పడుకుంది చంద్రవదన.

*  *  *  *

కోపగించి వెళ్ళిపోయిన పరాయిదేశపుగారు కొన్ని రోజులు వూరుకొన్నతరువాత తిన్నగా భటులను పంపించారు రాజుగారివద్దకు!

'మాగుర్రంపిల్లసంగతి ఏమిటి? ఇంతదాకా సాక్షులను దాచివుంచడానికిగల కారణ మేమిటి? యిలా ఎంతకాలమని మమ్ములను మోసగిస్తారు!

వెంటనే న్యాయం ఏదో తేల్చదలచుకుంటే మన గుర్రాలు నిల్చినచోటనే వున్న ఆ ముసలి భార్యాభర్తలను

చంద్ర అనే అమ్మాయిని బయటకు తెండి. అలా తేకుండా అన్యాయంకు ఒడిగడతారా? మన రెండుదేశములమధ్యా సంగ్రామం తప్పదు. వెంటనే జవాబుకోసం ఎదురుచూస్తూంటాను' - అని కబురంపించాడు.

ఈ కబురును విన్న ఆదేశపు రాజుగారు మరీ చింతిల్లడం ప్రారంభించారు- రోజురోజుకూ నిద్రాహారాలు మరచి పరాయి దేశపురాజుగారివలన మాటలుపడవలసి వచ్చినందుకూ ఇటు తనకు తెలియకుండా సాక్షులుఅనుకున్న ముగ్గురూ మాయమయినందుకూ.

మంత్రీ, ఆస్థాన సలహాదార్లూ ఎన్నో ప్లానులు వేశారు. ఎన్నో ప్రయత్నాలు చేశారు. వారి ముగ్గురిజాడా ఎక్కడా దొరకలేదు.

'ఎలాగా! రాజుగారు చూస్తే చాలా అగౌరపడవలసి వస్తూన్నందుకు కృశించిపోతున్నారు! మనకా ఎటూ విషయం అంతుచిక్కడంలేదు. ఏం చేయడం? తరుణోపాయం ఏమిటి?' అని ఆలోచనలుచేయసాగారు మంత్రీ సలహాదారులూ!!

రాజుగారికోటలో గంటమ్రోగింది! ఉదయ భానుకిరణాలు కొంచెంగుంచెంగా దూరాన్నుంచి దూసుకొని జైలు గదిలో ప్రసరిస్తున్నాయి!

భటులువచ్చి ఒక్కరొక్కరినే బయటికి వదలుతున్నారు! చంద్రతలిదండ్రులను కూడా బయటకు వదిలారు. తిరిగి అందరినీ వారివారి గదులలోకి త్రోసి బంధించారు.

కాని చంద్రతల్లిదండ్రులను తిన్నగా జెయిలులోపడే యకుండా బందోబస్తుతో కోరుకు తీసుకుపోయి హాజరు పర్చారు.

అది ఒక పెద్ద మైదానం! ఆ మైదానంలో చక్కగా పెరిగిన పచ్చగడ్డి నేలమీద రంగులతివాచీ పరచినట్లుగా వుంది. ఆ ఆకుపచ్చనినేలకు నాలుగువైపులా చక్కని లతలు తీర్చిన సిమెంటుగోడలు - గోడలకుప్రక్కన చక్కగా కుండీలలో రంగురంగుల గులాబులూ - క్రోటన్సులూ - మనోహరంగా అమర్చబడివున్నాయి!

ఆలాటిప్రదేశంలో మధ్యగా కట్టబడివుంది, ఒకబంగళా. ఆ బంగళాకుచుట్టూ లతలువారి, మధురగాలులు వీస్తున్న ఎర్రని-పచ్చని-రంగులలో పూలతీవెలు- ఆ శోభ మధ్య సింహద్వారం - ఆసింహద్వారంకు ఇరువైపులా ఆయుధధారులైన సేవకులు నిలిచియున్నారు.

ఆలోపలే పెద్దగది- ఆగదిలో రౌండుగా ఒకపెద్దబల్ల బల్లచుట్టూతా ఒకేరకపు కుర్చీలు - వీటికి యెదురుగా ఒక సింహాసనరూపమైన కర్రఆసనం—ఆ ఆసనానికి, కుడిప్రక్కన ఒకభటుడు- ఎడమప్రక్కనే నాలుగుచక్రాలుకట్టిన ఒకబల్ల- వీటికి మధ్యగా ఎత్తుగావుంది—కర్రసింహాసనం! ఆ సింహాసనంలో నిలువెత్తుమనిషి ఆసీనుడై వున్నాడు.

ఒక్కసారిగా గంట ప్రతిధ్వనించింది. బిలబిలా జనం వస్తున్నారు.

ఒక్కరొక్కరే కోర్టులోకి వెళ్ళుతున్నారు. ఇదంతా చూస్తూ అయోమయంగా నిలబడి వున్నారు చంద్రవదన తల్లిదండ్రులు !

ఇంతలో వీరికి పిలుపు వచ్చింది. భటులు లోనికి ప్రవేశపెట్టారు. చంద్రతండ్రిని బోనులో ఎక్కించారు. చంద్ర తల్లి క్రిందనే నిలిచివుంది. బోనులో చంద్రతండ్రిని నిలుప గానే ఒక సేవకుడు వచ్చి ప్రమాణంచేయించాడు. అలాగే 'దేవునిఎదుట అబద్ధంఆడను, నిజం చెబుతాను' అని చంద్ర తండ్రి ప్రమాణంచేశాడు.

క్రిందనుంచున్న చంద్రతల్లి కళ్ళవెంట నీరు బొటబొట కారుతున్నాయి. చేతులు ఒణుకుతున్నాయి ఏనాడూ బోను ఎక్కియెరుగరు, ఏనాడూ జెయిలుఎరుగరు. మాటపడి ఎరు గనిజీవితాలు! సుఖంగా గడచిన దాంపత్యం!

అటువంటిది ఈనాడు యిలా జరిగినందుకు నిలువునా కుప్పగా కూలిపోయారు!

బోనులో నిలుచున్న తండ్రికి కాళ్ళు ఒణకసాగాయి. నోరుఆరిపోసాగింది! ఏంజరుగనున్నదో? అని ఒకవైపుబాధ, వేరొకవంక చంద్రనుగురించిన తలంపు.

ఇంతలో కోర్టుజడ్జి బల్లమీద గుద్ది- 'ఏమయ్యా! నీపేరు ఎవరు?' అని అడిగాడు!

'నా...' బావురుమంటూ దుఃఖించసాగాడు మాట చెప్పలేక తాను.

తన భర్తఏడుపును చూసి నిలువునా ఏడుస్తూ కూలి పోసాగింది భార్య!

'ఎవరు నీపేరు?' గద్దించాడు జడ్జి తిరిగి.

'అయ్యా! నాపేరు ఎందుకు? నేను పేరుకలిగినవాడనైతే యిక్కడెందుకుంటాను? నాకు పేరూలేదు;ఊరూలేదు. అనామకుడను నేను.

నన్ను ఎందుకు బంధించారో, నేను చేసిననేరంఏమిటో నాకు తెలియదు. నేను యిప్పుడు చాలా అగమ్యగోచరంగా వున్నాను. నన్ను మాటలతో విసిగించి వేపుకు తినకండి. నన్నూ నాభార్యనూ మీయెదుట నిలబెట్టారు. ఏన్యాయంతో శిక్షవిధించదలచుకున్నారో వెంటనే ఆశిక్షను శిరసావహించడానికి సిద్ధంగా వున్నాము.' చాలా ఆవేశంగా మాట్లాడి వూరుకున్నాడు వృద్ధు!

'సరే! మీరు మీనేరం ఒప్పుకోవడం లేదు. విచారణకా మాటలు పలుకడంలేదు. ఇక మీకు శిక్షతప్ప గత్యంతరంలేదు. ఒకనేరం మీమీద ఆరోపించినప్పుడు ఆ నేరాన్ని ఖండిస్తూ మీరు వాదించుకోవాలి. అలా ఖండన అనేది లేకుంటే మీమీద మోపబడిననేరాన్ని అంగీకరించినట్లేనన్న మాట! కాన మీకు యిక వాయిదాలు యివ్వకుండా శిక్షను యీరోజే యిస్తున్నాను' అని ముగించాడు జడ్జి.

కోర్టు అంతా ఒక్కసారి గోలతో ప్రతిధ్వనించింది.

ఆవృద్ధులహృదయాలు తల్లడిల్లినవి.

జడ్జి ఏంశిక్ష విధించనున్నాడో అని ప్రజలు ఎదురు చూడసాగారు. ఆచంద్రవదన తల్లిదండ్రులు కత్తివేటువేస్తే

నెత్తురుచుక్క లేకుండా గుడ్లప్పగించి జడ్జికేసిచూస్తూ నిల బడ్డారు.

మరి ఏం తోచిందో ఏమో వాయిదాను యివ్వనన్న అధికారి తిరిగి వారిని సంబోధించి,

'మీకు రెండురోజులు గడువుయిస్తున్నాను- ఆగడువు లోపల మీరు మీసాక్షులను కోర్టుయెదుట హాజరుపరచి మీన్యాయాన్ని రుజువుపర్చుకోనండి' అనిచెప్పి ఆ రోజుకు కోర్టు చాలించాడు.

* * * *

చెట్టుతొర్రలో పడేశారుకదూ చంద్రను. అలా తొర్రలోనే చాలాసేపు యేడ్చియేడ్చి, అరవగా అరవగా, ఆదొంగలనాయకునిభార్య వచ్చి, ఎవరోపాపం అనుకొని, ఆతొర్రలోవున్న చంద్రను బయటకుతీసింది. చూసీచూడడం తోనే ఆదొంగలనాయకునిభార్య హృదయం ఎంతకటికదైన ప్పటికీ, చంద్రబుగ్గలకు మురిసిపోయి ఎంతోగారాబంగా కందిపోయిన చంద్రబుగ్గలను ముద్దెట్టుకుంది. అసలే పిల్లలు లేని ఆమెకు చంద్రమీద చెప్పలేని అనురాగం పుట్టుకొ చ్చింది. ఆరోజునుంచీ ఆ పాపను పుట్టలతో నిండివుండే తొర్రలో దొరికిందిగనుక 'పుట్టపురాణి' అని నామకరణం చేసుకొని అల్లారుముద్దుగా పెంచుకుంటోంది.

అక్కడే ఆ దొంగలమధ్యనే ఆడుకొంటూ, చక్కగా పెరుగుతూ, రోజులు దొర్లించుకొస్తోంది ఈ పుట్టపురాణి.

ఈవిధంగా ఆడుకొంటూ వుండేకాని, తన దృష్టిఅంతా తనతల్లితండ్రులమీదనే వుంది. అదే ఆలోచన-

అవేకలలు-'తండ్రిని ఏంచేశారో? తల్లిని ఏంహింసిస్తున్నారో? నీ కూతురు ఎక్కడికి పారిపోయింది? ఎక్కడికి దాటించి వేశారు? అని కొడుతున్నారేమో? ఎలాగ యిక్కడనుంచి పోవడం? ఏం చేయడం?' అని ఆలోచిస్తూనే వుంది.

ఇలా ఆలోచనలో మునిగివుండగా ఒకచిలుక అక్కడకు వచ్చింది. వచ్చి ఒకచోట వుండకుండా తిన్నగా వెళ్ళి దొంగలరాజుభార్యతో ఏదోమాట్లాడి, ఒక కాగితపుముక్కను కరుచుకొని తిన్నగా యెగిరిపోయింది. ఈవిషయమంతా కని పెట్టింది పుట్టపురాణి.

అసలు జైలుగదిలోవుండగా ఒక రాత్రిరోజున ఈ చిలుకపలుకులు వినేకదూ ఏమిటోనని గోడపెల్లగించింది.

అలాపెల్లగించిన తదుపరి ఆ చిలుక మాయమయింది. కాని, తాను వెనుకకు వెళ్ళకుండా ముందుకువచ్చింది. ఆరాక లోనే దొంగలు పట్టుకున్నారు. అప్పటినుంచి యిక్కడే వుంటుంది. కాని యీచిలుకసంగతి గుర్తులేదు. అనుకోకుండా ఉన్నట్లుండి ఈరోజున చిలుక తిరిగి కంటబడింది. పడడమే కాదు. ఒక అనుమానాన్ని పుట్టపురాణి హృదయంలో రేకెత్తించింది- 'ఎలాగైనా యీచిలుకసంగతి కూపీ తీసి వ్యవహారం నడిపించాలి' అని మనసులో తలచుకొని జాగ్రత్తగా వుంది, అదనుకోసం ఎదురుచూస్తూ.

* * * *

గడువుముగిసినవెనుక చంద్రతల్లిదండ్రులనిద్దరనూ కోర్టుకు తిరిగి హాజరుపర్చారు జైలునుంచి.

యథాప్రకారం జనసందోహంతో కిటకిటలాడింది కోర్టు.

'ఏమిచెబుతారు? మీరు మీమీద మోపిన హత్యానేరాన్ని ఒప్పుకుంటారా? లేక కాదని, అన్యాయమని ఖండించుకొనే సాక్ష్యాన్ని హాజరుపరుస్తారా?' తిరిగి అడిగాడు జడ్జి.

'మేం చేసిందే నేరమో ఆపరాత్పరునికే తెలియాలి! మా తరఫున సాక్ష్యం చెప్పగలిగిందికూడా ఆ ఒక్క-పరాత్పరుడే! ఆయనమీదే మాభారాన్ని వదిలిపెట్టాం. కనుక మీ శిక్షను విధించి మీకర్తవ్యాన్ని పరిపాలించండి' అని చంద్ర తండ్రి ముగించాడు.

కోర్టంతా ఏంశిక్ష విధించనున్నారో అని నివ్వెరపోయి చూస్తున్నారు!

జడ్జి తనతీర్పును చెప్పడానికి ప్రారంభించాడు!

'మీరు ఈ దేశ న్యాయశాస్త్రానికి విరుద్ధంగా నడచుకొన్నారు.

ఒకనాడు మీరు ఒకతోటలోఉన్నసమయంలో ఒక పక్షిని నిలువునా బెడ్డపెట్టికొట్టి హత్యచేశారు. ఆ హత్యను ఒప్పుకున్నారా అంటే అందుకుకూడా మీరు మాట్లాడలేదు.

ఈదేశంలో ఏ జీవాన్నీ - అది జంతువయ్యేది - పక్షి అయ్యేది-చంపకూడదు. అది రాజశాసనం! అలా చేశారా, రాజధిక్కారనేరంక్రిందకే వస్తుంది.

అలాచేసి నేరం ఒప్పుకుంటే కొంతలో కొంత శిక్ష తగ్గించడానికి వీలుకలుగుతుంది! అలాకాకుండా వున్నందున మీరు రెండుశిక్షలను అనుభవించవలసి వుంటుంది.

ఒకపిట్టను హత్యచేసినందుకు మీకు ఉరిశిక్ష విధిస్తు న్నాను.

ఆనేరం ఒప్పుకోకుండా దాచి కుట్రపన్నినందుకు చిత్రవధ శిక్షను విధిస్తున్నాను. ఈ రెండుశిక్షలూ ఏకకాల మందే జరుగవలసివుంటుంది' అని తనతీర్పుచెప్పి జడ్జిగారు కోర్టును ఆనాటికి ముగించారు.

అక్కడచేరినప్రజలు ఈవృద్ధులనుచూసి, ఈమహాశిక్ష లనుచూసి కళ్ళవెంటనీళ్ళు కార్చారు. అయ్యో!అని పెదవులు విరిచారు.

ఈశిక్షలు విన్న వృద్ధురాలు అక్కడనే మూర్ఛిల్లింది. వృద్ధుడు నిర్వీర్యుడై కట్టెలా అయిపోయాడు.

కోర్టువారి నిర్ణయంప్రకారం చంద్రతల్లిదండ్రులను తిన్నగా ఆదేశపుఅడవిలోవున్న చిత్రవధశాలకు కత్తులుధరిం చినభటులు కొనిపోయారు!

ఆ అడవి మహాభయంకరంగా దట్టంగావుంది. దారి అగమ్యగోచరంగా వుంది. వెళ్ళినదారివెంట వెళ్ళకుండా, నిలిచినచోట నిలవకుండా అలా వెళ్ళివెళ్ళి ఒకచోట— ఒకబండరాయి నిలువునా పెట్టబడినచోట వీరిని నిలబెట్టారు!

ఆరాయిమీద యిద్దరనూ మెడలుపెట్టమని చేతుల లోని మెరుస్తూన్నఆకత్తులను ఎత్తారు. దేవుని ప్రార్థించుకో మన్నారు!

దేవునికి చేతులుఎత్తి చంద్రతల్లీదండ్రీ ప్రార్థనలు చేయసాగారు.

'మహానుభావా! లీలామానుషరూపా!! మేము ఎలాగా యీ సమయంలో—యీ కసాయికత్తులకు బలి అవుతాము. అది రాజాజ్ఞ! న్యాయశిక్ష!!

కాని, మాకోసం మా ముసలిప్రాణాలను ఏదోఒక విధంగా కాపాడాలని తలచి, తెగించి, ఎక్కడికో వెళ్ళి పోయిన మా చంద్రను రక్షించుతండ్రీ! ఈదురదృష్టవంతుల గర్భాన జన్మించినందుకు పడరానికష్టాలుపడిన మాచంద్రకు యికనైనా రక్షణచేకూర్చు. మాయీమరణవార్తకు క్షోభించ కుండా కాపాడవలసినభారం నీమీద వుంచుతున్నాము' అని తిరిగి తమ మెడలను ఆ చిత్రవధచేసే బండరాయి మీద వుంచారు.

'జై కాళీ! జైజై కాళీ!!' అంటూ చిత్రవధచేసే భటులు కసాయికత్తులు ఎత్తారు.

♦ ♦ ♦ ♦

చిలుక కనుపించినప్పటినుంచీ ఏదోవిషయం ఉందని, ఆసంగతి ఆరాతీయాలని ప్లాను వేసుకున్న 'పుట్టపురాణి' తిన్నగా తనును గారాబంగా పెంచుకుంటూన్న దొంగల ముఠా నాయకునిభార్యవద్దకు వెళ్ళింది!

ఏదో ఆలోచిస్తూన్నట్టుగా కూర్చుంది! ఈ పరిస్థితిని కనిపెట్టింది దొంగలరాణి.

'ఏం అమ్మా! పుట్టపురాణీ! అలాగ ఏదో దీర్ఘా లోచనలో ఉన్నావు! నీ కేదైనా కావాలా? ఏమైనా కావాలన్న మాతో చెప్పు' అని అడిగింది.

ఆఁ! మంచిసమయం చిక్కిందిగదా అని మనస్సులో మురిసిపోయింది, పుట్టపురాణీ! ఈ సమయంలో తనకు కావలసిన సమాచారాన్ని, విషయాన్ని తెలిసికోవాలని అనుకుంది.

'అమ్మా! అమ్మా!! ఒకవిషయం చెప్తావా? చాలా వింతగా వుంది, అంది.

'ఓస్! ఈమాత్రం దానికేనా? ఇంతఆలోచనచేస్తూ కూర్చున్నది? ఆవిషయం చెప్పు వెంటనే తీరుస్తాను ఆసందేహాన్ని' అంది తల్లి!

'మరి - మరి, ఆ రామచిలుక మనయింట్లో వుంటూ - నీతో ఏదో చెపుతూ ఎక్కడికో వెళ్ళివస్తూం టుంది. ఆవిషయం ఏమిటో కాస్త చెప్పవా?, అని అడిగింది!

'అదా! గొప్పప్రశ్న వేస్తా వనుకొన్నాను! మరేం లేదు. ఆ చిలుక మనదే! అది మంత్రశక్తిగల చిలుక. నీతండ్రికి చాలామంత్రాలు వచ్చును. ఆ మంత్రంతో ఈ చిలుకను పంపితే అన్నివిషయాలు కూపీ తీసుకువస్తుంది. ఎక్కడకు వెళ్ళి ఏం తెలుసుకోమన్నా తెలుసుకొని మనకు చెబుతుంది' అని ఆదొంగల మాయాచిలుక గుట్టును చెప్పింది దొంగలమఠారాజు పెళ్ళాం

ఓ చాలా బాగావుంది అనుకొంది పుట్టపురాణి! వెంటనే చిలుకను చేరి ఆచిలుకతో తను కొన్నిపనులు ముగించుకోవాలని తలచింది. తిన్నగా ఎవరూ చూడకండా చిలుకవద్దకు వెళ్ళింది. చిలుకను మంచిచేసుకుంది.

'చిలుకా ! చిలుకా !! నేను ఒకవిషయం చెప్తాను. మరి కాదనకుండా చేస్తావా ?' అని అడిగింది పుట్టపురాణి !

'నాకు ఏం అభ్యంతరం లేదు, ఏపని చెప్పినా చేయడానికి ?' అంది చిలుక !

'ఓ యింకేముంది' అని ఎగిరిగంతేసింది పుట్టపురాణి !

'అయితే చిలుకా ! చిలుకా !! ఒకపని చేసి పెట్టాలి. నించున్నపళంగా వెళ్ళి, నువ్వు ఫలానాజైలులో - ఫలానా గదిలో బంధించబడివున్న మా తల్లిదండ్రులు ఎలా వున్నారో? ఏంచేస్తున్నారో కొంచెం తెలుసుకొని వస్తావా ?' అని అడిగింది !

'సరే ! వెళ్లి సంగతి తెలుసుకుంటాను' అని ఎగురబోయింది, చిలుక.

ఇంతలో ఒక అనుమానం తట్టింది, పుట్టపురాణికి. సరే చిలుక వెళ్ళేసమయానికి అక్కడ అమ్మా, నాన్నా, లేకపోతే ఎంచేయడం ? చిలుక తిరిగి అక్కడలేరని వచ్చేస్తుంది అనుకొని,

'చిలుకా ! ఒకమాట. మరి ఆగదిలో మా అమ్మా, నాన్నా ఉండకపోతే ఏం చేస్తావు మరి' అని అడిగింది !

అందుకు చిలుక పకాపకా నవ్వి 'ఇదా నీకు తెలిసింది? నాకు చాలావిద్యలు వచ్చు. మనుష్యులు ఎలావెళ్ళారో వారి అడుగులజాడల వాసనపట్టి తిన్నగా అక్కడకు వెళ్ళగలను. నీ కెందుకు - నేను పనిముగించుకొనివస్తానుకదా !' అని ఆచిలుక తుర్రునఎగిరి వెళ్లిపోయింది.

తిన్నగా పుట్టపురాణి చెప్పినగుర్తుల ప్రకారం ఎగిరివెళ్ళి ఆ జెయిలులో ప్రవేశించింది. అక్కడ ఎవరూ లేరు. అక్కడ నుంచి వారిజాడను వాసనపట్టి యింకోగదిలోకి వెళ్ళింది. అక్కడా ఎవరూ కనుపించలేదు. తిన్నగా అక్కడనుంచి వెతుక్కుంటూ కోర్టుకు వెళ్ళింది. అక్కడా ఎవరూ కనుపించలేదు. అక్కడినుంచి జాడలవాసనగుర్తుపట్టి తిన్నగా అడవిలోవున్న చిత్రవధచేసే బండరాయివద్దకు చేరుకుంది. అక్కడవృద్ధులు యిద్దరూ బండరాయిమీద మెడలు నిలిపి కనుపించారు. ప్రక్కనే కత్తులుధరించినభటులు కనుపించారు. ఇంకా వారిని శిక్షించలేదు ఆభటులు!

ఈ విషయాన్ని చూసిన చిలుక వెంటనే శరవేగంతో తుర్రున ఎగిరి తిన్నగా పుట్టపురాణివద్దకు వచ్చి ఈవిషయం అంతా చెప్పింది.

తన తల్లిదండ్రులు చంపబడుతున్నారని విని గోడు గోడున ఏడ్చింది. హడలిపోయింది. వెంటనే యిక వూరుకుంటే లాభంలేదని ఒకవుపాయం ఆలోచించింది.

'చిలుకా! చిలుకా!! ఈసమయంలో మనం ఎలాగైనా మా తల్లిదండ్రులను రక్షించుకోవాలి. అందుకు ఏం చేదాం?' అని అడిగింది.

'నేను ఓ ఉపాయం చెబుతాను విను. నీతండ్రిఅయిన దొంగలరాజు పడకగదిలో ఒకపెట్టె వుంది. ఆ పెట్టెను కాపలాకాస్తూ ఒకకుక్క వుంటుంది. ఆకుక్కను మంచిచేసుకుని లోనికి వెళ్ళితే ఆపెట్టె కనిపిస్తుంది. ఆపెట్టె తెరిస్తే ఒక

పెట్టె వస్తుంది. ఆ పెట్టెమీదకనక మూడుసార్లు నువ్వు కొడితే ఆ పెట్టె తెరుచుకుంటుంది. అందులో ఒక చిన్నభరిణె వుంటుంది. ఆ భరిణెలో ఒకఆకు వుంటుంది. ఆ ఆకునుకనుక తీసుకువెళ్ళి మీ తల్లిదండ్రులమీద పడేస్తే, వారు ఏ రూపం లోకి మారిపోవాలని కోరుకుంటావో ఆ రూపంలోకి మారి పోతారు. అలా చేయి. బాగుంటుంది' అని సలహాయిస్తూ ఉపాయాన్ని సూచించింది చిలుక.

'బలే! బలే!! గొప్పఉపాయం చెప్పావు చిలుకా! నీ ఋణం ఎప్పటికీ తీర్చుకోలేను. నీమేలు ఏనాడూ మరువను' అనిచెప్పి వెంటనే తిన్నగా తండ్రిపడుకొనేగదిలో ప్రవేశిం చింది. తిన్నగా పెట్టెవద్దకు వెళ్ళబోయింది. ఇంతలో కాపలా వున్నకుక్క మీదకు వురికింది. ఎలా తప్పించుకుందామన్నా ఆకుక్క వదలలేదు. తిన్నగా తల్లిఅయిన దొంగలరాణిని చేరింది. 'అమ్మా! అమ్మా!! ఆకుక్క నన్ను కరువబోయింది చూశావా! దానికి ఎంతపొగరో? పుట్టపురాణి నన్న గౌరవం కూడా దానికి లేదు. నాన్నరానీ చెప్పి దాన్ని చితకకొట్టి స్తాను' అని గారాబంగా నటనచేసింది పుట్టపురాణి!

ఓస్! ఈమాత్రందానికేనా నాన్నకు రిపోర్టు! ఆకుక్క ను మంచిచేసుకోవాలంటే - ఒకరహస్యం వుంది. తిన్నగా వెళ్ళి ఆకుక్కకు కుడివైపునవున్న ఒకకర్రను నువ్వు తీసుకో వాలి. ఆకర్ర నీవు చేతధరించగానే ఆకుక్క మొరగదు సరి కదా, నీకువెనుకనే తోకలడిస్తూ వుంటుంది. ఆపనిఅంతా

చేయకుండా వెడితే కరవదా మరి' అని విషయంచెప్పి తల్లి వెళ్ళిపోయింది.

ఎలాగైతేనేం, గుట్టుకాస్తా తెలిసిపోయింది పుట్టపు రాణికి.

తిన్నగావెళ్ళి, ఆకర్రను అందుకుంది. ఈతూరి కుక్క అరవలేదు. కరవరాలేదు సరికదా, తోకఆడిస్తూ నిలిచింది. చిలుకచెప్పినప్రకారం తలుపుతెరిచింది. అందులో ఒకపెట్టె కనుపించింది. అది తెరిచింది. అందులో ఒక బరిణె కనుపించింది. చిలుకచెప్పినట్లుగా చేయగా బరిణెలో ఆకులు కనుపించాయి. మహాసంతోషంతో ఆకులను తీసుకొని గబగబా ఆకర్రను అక్కడనే పడేసి చిలుకవద్దకు వచ్చింది.

'ఏంచేసుకువచ్చావు పుట్టపురాణీ! కుక్క కరవలేదు కదా!' అని అడిగింది చిలుక.

'ఇదిగో ఎలాగో అలాగ సాధించుకువచ్చాను. వెంటనే మాతల్లిదండ్రులమీద యివిచల్లి వారిద్దరూ పక్షులుగానో, జంతువులుగానో మారిపోవాలని కోరు. అలాకోరితే అలామారిపోయినవారిని ఆరూపంలో మనం యిక్కడకు తెచ్చుకుందాము' అని చెప్పి చిలుకను పంపివేసింది.

చిలుక ఆకునుతీసుకొని తిన్నగా ఎగురుతూ వెళ్ళిపోయింది ఆ అడవిలోకి.

♦ ♦ ♦ ♦

'ఒరేయ్! కొంచెంసేపు వీళ్ళను అలా వుండనియ్యరా పాపం' అన్నాడు ఒకభటుడు.

'ఏమిట్రోయ్! ఇంకా ఎంతసేపురా? కానియ్యరా వెయ్ వేటు' అని కత్తిఎత్తాడు ఇంకొకడు.

'అది కాదురా! ఒకధర్మసందేహంరా! మనం యిలా ఎంతమందిని నరికేస్తున్నామో తెలుసునా? ఈపాపంఅంతా మనకు కాదంట్రా చుట్టుకొనేది? చేసిననేరం వీళ్ళా - శిక్ష విధించేది దొరలా - మధ్యన నరికి పాపంపంచుకొనేది మన యిద్దరమూనా? చెప్పు'అని మొదలుపెట్టాడు!

'అవునురా! నిజమే. ఎంతపాపంచేయకుంటే ఈవృత్తి లోకి దిగుతాముర్రా? అందుకే మనకు పిల్లాపీచూ లేకుండా గొడ్డైదవలమై వున్నా మనుకో' అన్నాడు మరొకడు!

ఇలా ఒకరితో ఒకరు సంభాషించుకుంటున్నారు.

అప్పటికే చాలాకాలం జరిగిపోయింది. ఇక ఆలస్యం చేస్తే పైవాళ్ళు అడుగుతారు అని తలచుకొని, 'ఒరేయ్! ఈమాటికి కానియ్యి. తరువాత ఆలోచిద్దాం' అని అనుకొని కళ్ళుమూసుకొని కాళిని తలచుకొని కత్తులుపైకెత్తి కళ్ళు తెరచి చూశారు, వేటువేయడానికి భటులు.

తీరాచూస్తే అక్కడ ఆ ముసలిదంపతులు లేరు. అక్కడ ఆబండరాయిమీద కనుపించిందల్లా రెండు త్రాచు పాములుమాత్రం.

'అరే! ఇదేమిటి? ఇక్కడ మనుష్యులు లేరు. ఎలా మాయమైపోయారు? బాబోయ్! పాములురోయ్!' అంటూ ఒకరినిఒకరు కావిలించుకున్నారు.

వారికళ్ళనువారే నమ్మలేకపోయారు. భయంతో చేత ధరించినకత్తులను అక్కడనేవదిలేసిపరుగుపరుగున వెనక్కైనా తిరిగి చూడకుండా కాలికి బుద్ధిచెప్పారు.

అలా వెళ్ళి వెళ్ళి ఒకచెరువుగట్టున ఆయాసంతో కూర్చున్నారు.

'ఏంచెప్పడం, కోటలోని అధికారులకు? నేరస్థులను శిక్షించుకుని వచ్చారా అంటే సమాధానం ఏమిటి? లేదంటే మనలను శిక్షకు పాత్రులను చేస్తారు. ఎలాగురా భగవంతుడా' అనుకుంటూ అతిభయంతో ఎలాగైతేనేం కోటలో ఆ యిద్దరు భటులు ప్రవేశించారు.

చిలుక తిన్నగా ఎగిరి దొంగలస్థావరాన్ని చేరుకుంది.



చిలుకను చూడగానే ఎప్పుడు వస్తుందా, ఎప్పుడు వస్తుందా? అని ఎదురుచూస్తూన్నపుష్పరాశికి ఎక్కడలేని సంతోషం కలిగింది. ఆతృతతో చిలుకనుచేరి, 'ఏమైంది? మానాన్నా అమ్మా బ్రతికారా? నన్నుగురించి అడిగారా' అంటూ చిలుకను అడిగింది.

'ఓ బ్రతికిపోయారు ఇంకొంచెం ఆలస్యమైతే పాపం నరకబడేవారే! కానీ, ఇంతలో నేను చేరి, నాపని ముగించాను. ఆసమయంలో ఆకాశాన్నించి ఆకులు వారిమీదపడేస్తూ ఏమని పడేశానో నాకు జ్ఞాపకంలేదు. నన్ను ఏంచేయమంటావు? జంతువులుగా మారాలని అన్నానో పక్షు

లుగామారాలని అన్నానో మరచిపోయాను' అని చింతిస్తూ చెప్పింది చిలుక.

అయ్యో! ఇంతకూ నాతల్లిదండ్రులు చివరకు ఏరూపంలోనో మారిపోయి ఆ రూపాలైనా తెలియకుండా పోయిందా? నేను నాతల్లిదండ్రులను కలుసుకోనేది ఎలాగ? రాయిఅనుకోనా? రప్ప అని అడుగనా? పక్షులని పలుకరించనా? జంతువులని చేరదియ్యనా? ఏం చెయ్యను?' అంటూ అక్కడే అలాదుఃఖిస్తూ పడివుంది పుట్టపురాణి!

♦ ♦ ♦ ♦

చిలుక అక్కడ ఆవృద్ధదంపతులనుచూసి పాములుగా మారిపోవాలనికదూ కోరుకుంది! ఆలాగే పాములరూపం ధరించి అలా అడవులవెంట పాకుకుంటూ ఆ సర్పదంపతులు వెళ్ళిపోయారు. ఆఖరుకు ఆ వెళ్ళినజాడకూడా ఎవరికీ తెలియదు.

అలా ఎక్కడెక్కడికో వెళ్ళిపోయాయి ఆసర్పములు.

ఈవిధంగా నెలలు గడిచిపోయాయి. కాని తనతల్లిదండ్రులజాడ కనుపించలేదు. చాలా బెంగతో లోలోపలే ఈవిషయాన్ని దిగమ్రింగుకుని బాధపడసాగింది పుట్టపురాణి!

దొంగలముఠాలో ఆడవారికికూడా కర్రతిప్పడం, బాణసంధానం నేర్పుతారు. పుట్టపురాణీకికూడా అలానే నేర్పసాగారు.

రానురాను పుట్టపురాణి మంచిఉత్సాహంగా కర్రసాము, బాణవిద్యలు నేర్వసాగింది. మంచిప్రావీణ్యం సాధించిందికూడా!

ఉదయం లేచిందిమొదలుకొని సాయంత్రంవరకు ఆఅడవులలోపడి పిట్టలను కొట్టా, జంతువులనుకొట్టా - అలాగే తిరుగుతూవుంది. కానీ, యెంతమరచిపో వాలనన్నా తన తల్లిదండ్రులు గుర్తుకువస్తున్నారు- అదే ఆలోచన, అవే కలలు!

ఒకనాడు మంచినిద్రలో మునిగివుంది పుట్టపురాణి. కొంతరాత్రిగడచినవెనుక ఒకకలమాదిరి వచ్చింది,

'చంద్రవదనా! చంద్రవదనా! మమ్ములను వదలిఅలా దొంగలముఠాలోచేరి ఆడుకుంటూ పాడుకుంటూ వుంటావా? నిన్నుకన్న యీముసలివారిని వదిలివుంటే నీమనస్సుకు ఎలా తోస్తోంది? రా! మమ్ములను కలుసుకో. నిన్ను చూస్తేగాని వుండలేము. హుం! బయలుదేరు.'

వెంటనే లేచింది పుట్టపురాణి. ఇక నాతల్లి దండ్రులను విడచి ఒక్కనిమిషంకూడా వుండలేను. ఉండకూడదు. ఎన్నికష్టాలు వచ్చినా, ఎన్ని అడ్డంకులు వచ్చినా సరే! నా తల్లిదండ్రులను వెతుక్కుంటూవెళ్ళి కలుసుకొంటాను. రక్షించుకొంటాను అని తలచి ఎవరితోనూ చెప్పకుండా తిన్నగా ఆఅర్ధరాత్రి సమయంలో ఆదొంగలస్థావరాన్ని వదలి వెళ్ళిపోయింది పుట్టపురాణి!

అలా వెడుతూంటే ఒకపావురాయిలగుంపు కనుపించింది.

'పావురమా, పావురమా! మాఅమ్మా, మానాన్నా కనుపించడం లేదు. ఒకవేళ మీలో కలిసిపోయారేమో చెప్తావా?' అని అడిగింది.

పావురాయి శాంతస్వభావంతో కసరుకోనక 'అయ్యో! పాపం నీ కెంతకష్ట మొచ్చింది? మాలో ఎవరూ కలువలేదే. కలిస్తే మాకు తెలుస్తుంది' అని చెప్పింది.

సరేలే! అనుకొని యింకాముందుకు నడక సాగించింది పుట్టపురాణి. అంతలో ఒకయెలుగుబంటి బుసలు కక్కుతూ ఎదురొచ్చింది.

'ఎలుగుబంటీ! ఓ ఎలుగుబంటీ! నేను చాలాకష్టంలో ఉన్నాను. నా తల్లిదండ్రులు కనుపించకుండా మాయమై పోయారు. మీలో యెవరైనా కలిశారేమో కాస్త కోప గించక చెప్తావా?' అని అడిగింది!

'ఛస్! కొత్తవాళ్ళు మాలో కలిస్తే మేం వూరుకుం టామా? అయినా మాలో ఎవరూ కలవలేదు వెళ్ళు' అంది ఎలుగుబంటి.

అక్కడినుంచి కాళ్ళీడ్చుకుంటూ తిన్నగా ముందుకు వెళ్ళింది పుట్టపురాణి.

అక్కడో పులిజంట మహాఘోరసంగ్రామంలోమునిగి వుండడం కనబడింది. ఆదృశ్యాన్ని చూసి బెదరిపోతూ ఒక చెట్టుచాటుకు తప్పుకుంది. ఆచెట్టుప్రక్కన ఒకబాణమూ అంబులూ ఎవరివో వొదలిపెట్టబడివున్నాయి.

ఆc! చాలామంచిసమయం! ఈబాణాలు తీసుకుని, మనమీదకు ఏజంతువైనా దాడివస్తే ధిక్కరించవచ్చును అనుకొని వాటినితీసుకొని, బుజాన తగిలించుకొని తిన్నగా వేరొకవైపు నడకసాగించింది.

ఒక చెట్టు పైభాగాన రామదండు కనిపించింది. ఆదండు ఒకేగోలా-అల్లరీచేస్తోంది. క్రిందనుంచి పుట్టపురాణి నడచివెళ్ళడంచూసిన ఒకకోతి ఒకకాయనుకోసి మీాద పడే సింది. ఏమిటా అని చూడగా కోతి కనిపించింది. 'ఓ కోతీ! ఒకవిషయం నీతో మాట్లాడాలి. క్రిందకు దిగివస్తావా? నేను నీకు అపకారంచేయను' అని పిలిచింది పుట్టపురాణి!

సరే! ఎందుకో పనికట్టుకు పిలుస్తోంది పాపం! సంగతి ఏమిటో కనుక్కోనివద్దా మని తిన్నగా చెట్టుకొమ్మనుంచి దిగి పుట్టపురాణివద్దకు వచ్చి 'ఏమిటీ, ఒకవిషయం అడగా లన్నావు?' అని అడిగింది కోతి.

'మరేంలేదు. మీాలో ఎవరైనా కొత్తవాళ్ళు వచ్చి కలిశారా? మాతల్లిదండ్రులు మాయమైపోయారు' అని అడి గింది పుట్టపురాణి!

'ఇదా నువ్వు అడిగేది. ఇంకా ఏదో పెద్దవిషయం అడగబోతున్నా వనుకున్నాను. నీ తల్లిదండ్రులు కనుపించక పోతే మాతో చెప్పి మాయమయ్యా రనుకున్నావా? అయినా మీాతల్లిదండ్రులు కోతులుగా మారిపోయారని నీకు నమ్మక మేమిటి? అలా ఎవరైనా కోతులుగా మారి మాలో కలిస్తే మాకు తెలుస్తుందే! అలాంటి దేమీా కనుపించదు. గొప్పప్రశ్నవేశావుకనుక యిక వెళ్ళు' అని చెప్పి కోతి చర్రున చెట్టుకొమ్మమీాదికి దూకి వెళ్ళిపోయింది!

ఇదేమిటి? నేను ఎంతో కష్టంలో వుండి యిలా అడవు లవెంటబడి అడుక్కుంటూ వస్తూంటే - దీనికి ఇంత కోప

మెందుకు? అయినా మనరోజులు యిలా వున్నాయి. ఒకరి ననుకొని ఏంలాభం? అనుకుంటూ ముందుకు బయలుదేరింది పుట్టపురాణి!

అలాగ వెళ్ళగా వెళ్ళగా ఒకచోటుకు చేరుకునేటప్ప టికి మంచిదాహం వేసింది. నాలుగుమూల్లా కలయచూసింది. కాని ఆ అడవిమధ్యలో ఎక్కడా ఒకచెరువుగాని, ఒక కొలను గాని కనుపించలేదు. మంచి దాహంగావున్న పుట్టపురాణి ఆ దాహానికి నిలవలేకపోయింది. ఎలాగైనా నీరు సంపాదించు కోవాలనుకొని కనుపించిన దారులవెంట అదేపనిగా చెరు వులుగాని కనిపిస్తాయేమోనని బయలుదేరింది. ఎంతదూరం వెళ్ళినా ఏమీ లాభంలేకపోయింది.

రానురాను చెమటలు పోయసాగాయి. ముందుకు నడవలేకపోయింది. అక్కడనే ఒకచెట్టునీడన చతికిలబడి పోయింది. అలా కొంతసేపటివరకూ తనఒళ్ళు తనకు తెలియ కుండా పరుంది!

ఇలావుండగా కొంతదూరంలో ఏనుగ కనుపించింది. ఆ యేనుగను చేరి 'ఓ ఏనుగా! ఓ ఏనుగా!! నువ్వు నాకు ఒకచిన్న ఉపకారం చేసిపెట్టగలవా? నీకు కావలసిన ఉప కారం నేను చేస్తాను' అని అడిగింది పుట్టపురాణి!

'నేను నీకు ఏం ఉపకారం చేయగలను? అయినా ఆ ఉపకారమేమిటో కాస్త చెప్పు చూదాం.'

'నేను దాహంతో విలవిలా తన్నుకొంటున్నాను. ఈ అడవిలో ఎక్కడా నాకు ఓచెరువుగాని, కొలనుగాని కను

ఓంచలేదు. నీకు కొలనులు అంటే మహాఇష్టం కదా! కాస్త దాహం తీర్చుకుంటాను. ఏదైనా కొలనుకు తీసుకొని వెళ్ళు తావా?'

'దాని కేముంది? ఈ అరణ్యంలోవుండే వాగులన్నీ నాకు తెలుసు. అక్కడనే కదా అస్తమానమూ ఈతలాటలు జరిగేది. నా నడ్డిమీద యెక్కి-కూర్చో. నిన్ను ఒకక్షణంలో అక్కడకు తీసుకునిపోయి దించుతాను' అంది యేనుగ!

చాలాసంతోషపడి, ఏనుగను మెచ్చుకొని, ఏనుగ మీద ఎక్కి, తిన్నగా ఓకొలనువద్దకు చేరింది పుట్టపురాణి.

అక్కడ దిగి ఆకొలనులో నీరు కడుపునిండా త్రాగి దాహంతీర్చుకుని గట్టుకువచ్చింది.

ఓయేనుగా! ఓ ఏనుగా! నీరుణం ఎలాగ తీర్చుకో గలను? నాకు నిజంగా దేవుడిలాగా తోడ్పడ్డావు. నా దాహంతీరింది. ఇక నీకు యేదైనా సహాయం చేయగలిగిందీ, చేయవలసిందీ వుంటే చెప్పు. చెయ్యడానికి ప్రయత్నిస్తాను' అని అడిగింది ఏనుగను పుట్టపురాణి!

ఇలా తనకు సహాయపడతానని ఎంతో ప్రేమకనుప ర్చిన పుట్టపురాణిని చూసి చాలా ఆనందాన్ని కనుపరచింది ఏనుగ.

'అవసరం అయినప్పుడు నన్ను సహాయంకోరు' అని చెప్పి ఏనుగ పుట్టపురాణివద్దనుంచి వెళ్ళి పోయింది.

అక్కడనుంచి తిన్నగా ముందుకువెళ్ళింది పుట్టపు రాణి, తల్లిదండ్రులజాడను వెతుక్కుంటూ.

♦ ♦ ♦ ♦

చంద్రవదన తల్లిదండ్రులను ఒకఅడవిలో చిత్రవధ చేయుటకు బండరాయిమీద పరుండపెట్టి హత్యచేయబో తున్న సమయంలో దొంగలవద్దవుండే మాయచిలుక సహా యంతో కదూ తల్లిదండ్రులు రక్షించబడి, ఆసమయంలో వారు ఇద్దరూ పాములుగా మారిపోయి, అలా అడవులవెంట వెళ్ళిపోవడం జరిగింది! అలా వెళుతూవెళుతూవుంటే ఎక్కడ నుంచో ఒకముంగిస ఎదురుగుండా వచ్చి కయ్యానికి కాలు దువ్వింది. సర్పదంపతులు ఏదోతమదారివెంట తాము పోతుం డగా యిలా మీదకు వచ్చిపడిన ముంగిసను చూసి నిలువునా నీరైపోయారు

అదనుచూసి ఆడసర్పముమీదకు వురికింది ముంగిస. ఆత్మరక్షణకోసం ఆ ఆడసర్పముకూడా పడగెత్తి కంగు కూసింది!

ఈవిధముగా సర్పము-ముంగిసలమధ్య యుద్ధం చాలా పట్టుదలగా జరిగింది. ఇక ముంగిసముందర ఆడసర్పము నిలువ లేని పరిస్థితి వచ్చేసింది. ఈసమయంలో తనభార్య అపా యంలో మునిగివుందని గ్రహించిన మొగసర్పము వెంటనే ముంగిసమీదకు ఉరికింది. అంతదాకా పోరాడి అలసివున్న ఆడసర్పం విశ్రాంతితీసుకొంటూ తనభర్తపోరాటాన్ని తిల కిస్తూ ఏం జరుగుతుందా అని ఆతృతతో చూడసాగింది.

ముంగిస - మొగసర్పమూ యిలా గ[illegible]లతరబడి ఒకరిమీద ఒకరు దూకుతూ పోరాడాయి. [illegible]లా గైతేనేం

సర్పరాజు పౌరుషంతో దూకింది ముంగిసమీదకు. ఆ దూకుడును తప్పించుకొని ఎదురుదెబ్బ కొట్టింది ముంగిస.

ఈ సమయంలో దూరంగావున్న ఆడసర్పానికి కోపం ఎక్కింది. వెంటనేవచ్చి తనతోకతో ముంగిసను మెలివేసి అలాగా పట్టుపట్టి చితకకొట్టింది. అంతటితో ముంగిస నేల మీద పడిపోయింది.

ఒకరి నొకరు ఓదార్చుకుంటూ సర్పదంపతులు యిక అక్కడ వుండకుండా ముందుకు వెళ్ళిపోయారు.

కొంతసేపు విశ్రాంతితీసుకొని మరీవెడదాంకదా అని ఒకచెట్టుక్రింద సర్పదంపతులు విడిదిచేశారు. మహానందంగా కలిసివున్నసమయంలో ఒకచప్పుడు వినిపించింది సర్పదంపతులకు. అదేదో చూసి వస్తాను నువ్వు యిక్కడేవుండు అని చెప్పి సర్పరాజు ముందుకు వెళ్ళింది. తీరా చూస్తే ఎక్కడా ఏం అగుపించలేదు.

సర్పరాజు భార్యను విడిచి అలా వెతకడానికి వెళ్ళిన సమయంలో ఒకనెమిలి బుసలుకొట్టుతూ ఆడ పాముమీదకు ఉరికింది. అప్పుడే అలసి ముంగిసతో యుద్ధంచేసియున్న పాముకు ఈనెమిలిరావడంతో మరీబాధ అనిపించింది.

నెమిలి తనముక్కును యెక్కుపెట్టి మీదకు ఉరకసాగింది. ఎలా తప్పించుకుందామన్నా పొడుగ్గా మెడనుసాచి ముక్కుతో మీద కొటసాగింది. ఇలా వుండగా మొగసర్పం తిరిగివచ్చింది. తనభార్యమీద నెమిలి కాలుదువ్వడంచూసిన మొగసర్పానికి ఎక్కడలేని కోపమూ వచ్చింది.

సహించలేకపోయింది సర్పరాజు! వెనుకనుంచి పడగ ఎత్తి నెమిలిమీదకు దూకింది. ముందునుంచి భార్య, వెనుక నుంచి భర్త నెమిలిని పట్టుకొని మొర్రో అనిపించారు. ఇక ఇక్కడవుంటే ప్రాణాలు దక్కవనుకొని తిన్నగా పారి పోయింది.

అమ్మయ్యా! ఈరోజు రెండు ప్రమాదాలు ఎదుర య్యాయి. ఎవరిమొగం చూచి లేచామో పాడురోజు అను కుంటూ తిన్నగా అలా తొర్రలంటా పుట్టలంటా సర్పదంప తులు వెళ్ళిపోయారు.

ఇంతలో ఒకకప్ప బెకబెకలాడుతూ పరుగెత్తింది. పాము వెంటపడితే కప్పసంగతి చెప్పే దేముంది!

సర్పరాజు బుస్‌ మని గెంతింది. సర్పం ఎప్పుడైతే పడగవిప్పి బుసకొట్టిందో కప్పప్రాణాలుఅక్కడి కక్కడే ఆగి పోయాయి. ఇక మనం ఈరోజుతో ఆఖరు అనుకొంది కప్ప! ఎటూపోవడానికి దారిచిక్కలేదు. అలాగే నిలబడిపోయింది. సర్పరాజు నోరుచాచింది, మంచిఆహారం దొరికింద గదా అన్న సంతోషంతో. ఇంతలో ఆడనాగు అడ్డువచ్చి నిలబడింది.

'ఏం! కప్ప మనకుచిక్కింది. మంచి ఆహారం! ఈ సమ యంలో అడ్డువస్తావేమిటి? ప్రక్కకు తప్పుకో' అంది నాగ రాజు.

'కాదు! ఒకవిషయం చెబుతున్నాను విను. మనం మన ప్రాణాలు రక్షించుకొనికదా యిక్కడికి చేరినాము. ఒక

చోట ముంగిసతో పోరాటంచేసి ఎలాగైతేనేం తప్పించుకున్నాము. ఆవెనుక నెమిలి కత్తికట్టి విరుచుకుపడింది. ఆ సమయంలో నేను బలిఅవవలసినదాన్నే, మీరు అడ్డురాకపోతే! ఆ ప్రమాదాన్ని ఎలాగో దాటుకున్నాం. ఇక ఏ ప్రమాదం లేకుండా తప్పించుకుందా మనికదా ఈనడుమకు వచ్చింది. ఈలాటికష్టాలు అందరికీ వుంటాయి. ఎలుకను చూస్తే పిల్లికిలోకువ. పిల్లినిచూస్తేకుక్కకులోకువ. కుక్కను చూస్తే మరొకజంతువుకు లోకువ. అలాగే అంతాను.

ఏదో దారితప్పి మనకంట పడింది. పాపం; ఆకప్ప! ఏదో తిని మనం ఉండవచ్చు. మనలను చూసి ఎలా ఒణికిపోతోందో చూడండి. అందుకుగానుదయతలచి వదిలిపెట్టండి. అలా వదిలిపెడితే మనలాగే శత్రువునుండి ప్రాణాలు దక్కించుకున్నాముగదా అన్న సంతోషంతో వెళ్ళిపోతుంది' అని ఆడపాముచెప్పి తనభర్తనోటపడే కప్పను రక్షించింది.

ఇలా తనప్రాణాలు రక్షించినందుకు సర్పానికి లోలోపల నమస్కరించుకుని, బ్రతికానురా భగవంతుడా అనుకొంటూ ప్రక్కనేఉన్న ఒక గుంటలోకి చల్లగా జారుకుంది ఆకప్ప.

సర్పదంపతులు వారిలోవారు పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ ముందుకు బయలుదేరారు. ఇంతలో భర్త 'ఏం! నీకు ఈసమయంలో కప్పమీద అంతప్రేమ వచ్చింది? కప్పకంటె పాముకు రుచికరమైన ఆహారం ఏముంది? దీనికి కారణం ఏదోఒకటి వుండివుంటుంది' అంది.

'ఏమీ లేదు. జంతువుల్లోకి మనమేకదా విషజంతువుల మని పేరు మోసివున్నాము. కాని ఈ విషజంతువులకుకూడా కనికరమనేది వుంటుందనీ, హృదయం అనేది వుందనీ ఎవరూ గ్రహించరు.'

'విషజంతువులుగా మనలను చెప్పుకునేవారు మన మీదే కత్తికట్టే ముంగిసను ఎవరూ విషజంతు వని అనరు.

'ఎంత విషజంతువులైనా తమకు ఎదురయ్యేకష్టాలను ఎదుర్కొనడంలోనే కొంత అనురాగాన్ని నేర్చుకుంటాయి. అదే నేను కప్పవిషయంలో కనుపర్చిన అనురాగానికికారణం!

మనం చిక్కులలో చిక్కుపడి ప్రాణాలను రక్షించుకొనగదా యిలావచ్చాము. ఆపరిస్థితిని మనం మరువకుండా వుంటే మనం ఇంకొకరిమీాద దండెత్తము. కప్పను చూసేటప్పటికి నాకు ముంగిస కళ్ళముందు కనుపించింది. వెంటనే కప్పనీాూద ప్రేమపుట్టుకొచ్చింది. అందుకే మీా ప్రయత్నానికి విఘాతం కలిగించాను' అంది సర్పంభార్య.

భార్యపలికిన పలుకులకు సంతోషించి ఈకనికరం, అనురాగం, ప్రేమ అనేవి మానవులలోకూడా వుంటే ఎంతబాగుండునోకదా అంది భర్తసర్పం.

'మానవులు మనలను ఏంచేశారేమిటి! మనలను దేవుడుగా కొలువడంలేదా? మనకుచలిమిడిముద్దలు పెట్టడంలేదా? మనపుట్టల్లో పాలుపోయడంలేదా? మనపేరున పండుగలు చేయడంలేదా?' అని మానవులపక్షాన పలికింది భార్య.

'అబ్బే! అదికాదు. పొరపాటున ఏదారో తప్పి కంట పడితే వెనుకముందులు ఆలోచించకుండా మనలను కొట్టి చంపేస్తున్నారుకదా అని అంటున్నాను.'

'ఆ? అలా అందరూ చేస్తున్నారా? 'నాగుమయ్యా నీకు దండం' అని మనకు దండాలుపెట్టి మనలను దూరంగా పొమ్మని వేడుకోవడంలేదూ! అయినా మనలోమాత్రం న్యాయం ఎక్కడుంది చెప్పు? మానవుడు కంటపడితే కాటు వేస్తున్నాము. ఇది ఏం న్యాయం?' అంది భార్య.

ఇలా సంభాషించుకుంటూన్నారు సర్పదంపతులు.

ఇంతలో ఆకాశాన రెక్కలువిప్పుకు ఎగురుతున్న ఒక గ్రద్ద ఈ సర్పదంపతులను చూసింది. కాని గ్రద్దవస్తోందని సర్పదంపతులు గుర్తించలేదు. అవి ఏదో కబుర్లధోరణిలో వున్నాయి. ఇలావున్నసమయంలో గ్రద్దచూసి, 'ఓ బలే బాగుంది. మనశత్రువులు క్రింద చర్చలు జరుపుతున్నాయి. వీటిపని పట్టాలి' అని మనస్సులో అనుకొని తిన్నగా విమానంలాగా దిగివచ్చి ఆడపామును హఠాత్తుగా తన్నుకు పోయింది.

తనభార్యను యిలా తన్నుకుపోతున్న గ్రద్దనుచూసి చేయునదిఏమిలేక 'మొర్రో! మొర్రో! నాభార్య! నాభార్య!! పరాత్పరా! రక్షించు'అంటూ కేకలుపెడ్తూ దుఃఖిస్తూ అలా గద్ద ఎగురుతున్నవైపుకే ప్రాకుతూ సర్పరాజు పాపం వెళ్ళ సాగాడు.

◆ ◆ ◆ ◆

ఏనుగతో మాట్లాడి పుట్టపురాణి తన తల్లిదండ్రుల జాడలను వెదకుకుంటూ బయలుదేరింది.

అలా వెదుకుతూన్న సమయంలో నెత్తిమీద ఒక గ్రద్ద కనుపించింది. ఆ గ్రద్దను చూసింది. కాళ్ళకింద ఒక పాము చిక్కుపడివుండడం చూసింది పుట్టపురాణి. 'మన తల్లి దండ్రులు మనకు కనుపించకుండా పోయి మనం ఎంతో దుఃఖిస్తున్నామే! అలాగేకదా ప్రతివారికీ బాధలువుంటాయి. ఆగ్రద్ద అలా పామును తన్నుకపోతూంటే, ఆపాము తల్లో - భర్తో - పిల్లలో ఎంత దుఃఖించివుంటాయి? ఈ సమయంలో మనం న్యాయం చేకూర్చాలి అనుకొంది. అప్పుడే - చిన్న తనంలో వాళ్ళఅమ్మ చెప్పినకథ 'ఆండ్రోక్లిస్ - సింహమూ కథ జ్ఞాపకానికి వచ్చింది. ఎంత క్రూరజంతువైనా కష్టంలో వుందికదా అనికదూ ఆసింహానికి గుచ్చుకున్న ముల్లును తీసి సహాయపడింది. అలాగే మనంకూడా విషజంతువని పామును ద్వేషించి ఊరుకోకుండా గ్రద్దబారినుంచి రక్షించి ఉపకారం చేయాలనుకుంది పుట్టపురాణి.

తనకు ఒకచెట్టుకింద బాణాలు దొరికాయికదూ? అవి భుజాన్నే వున్నాయి. వెంటనే విల్లును ఎక్కుపెట్టింది. గురితీసి అటు గ్రద్దకు దెబ్బతగులకుండానూ, ఇటు పాము గ్రద్దకాళ్ళ పట్టునుంచి విడిపించుకు క్రిందపడిపోయేటట్లుగానూ కొట్టింది. బాణంవెళ్ళి గ్రద్దకాలిగోళ్ళలో దూరింది. గ్రద్ద పామును వదిలేసింది. గ్రద్ద ఎగిరిపోయింది. పాము తిన్నగా నేలమీద ఒకదుబ్బుకు దగ్గరగా పడింది.

పుట్టపురాణి వెళ్ళి 'నాగుమయ్యా! నీవు యీరోజు చాలా పుణ్యంచేసుకొన్నావు. నేను చూసివుండకపోతే ఆగ్రద్ద నిన్ను చంపివేసివుండును' అని పలికింది.

'అమ్మా నీమేలు మరువరానిది నువ్వు నన్ను కష్ట సమయంలో రక్షించావు. అసలు మానాగసంతతిని తుది ముట్టించడంకోసం పనికట్టుకు తిరుగుతూంది ఈగ్రద్దకూటం. ఇక నాకు దిక్కెవరూ లేరు. నాభర్తా నేనూ ఒకఅడవి మధ్యలో వుండగా ఈగ్రద్ద తన్నుకుని యిలా వచ్చేసింది. ఇక నాభర్తను కలుసుకుంటానన్నఆశ లేదుకదా! నీవద్దనే వుంటాను' అంది నాగు!

'నీవు చెప్పినవిషయాలువింటూంటే నాహృదయం పరితపిస్తోంది. ఒకవిషయం. మీనాగజాతిమీద ఈగ్రద్దకు యింతపగ ఎందుకో కొంచెంచెప్పగలవా అంది పుట్టపురాణి!

'అది చాలా పెద్దకథలే' అంది నాగు!

పుటపురాణికి కథలు అంటే చిన్నతనంనుంచీ చాలా యిష్టంకదూ! నాగు 'చాలాపెద్దకథ' అనగానే ఎగిరిగంతేసి, 'నాగూ! నాగూ! నీవు ఎంతోమంచిదానవు. ఆకథ అంతా నాకు చెప్పవా?' అని అడిగింది. ఆ సమయంలో వాళ్ళ అసలుఅమ్మ జ్ఞప్తికివచ్చింది పుట్టపురాణికి. కథలుచెప్పుమని యిలాగే వాళ్ళ అమ్మను అడిగి గారాంచేసేది పుట్టపురాణి!

'అయితే విను - కథ అంతా చెబుతాను' అని తన కథను ప్రారంభించింది నాగు!

'అనగా అనగా ఓరాజుకు ఇద్దరు భార్యలు. ఆఇద్దరి పేర్లూ వినతా - కద్రువ.

వీరిద్దరిమధ్యా సవతులకయ్యం కొంచెంజరుగుతూ వుండేది. ఇలావుండగా ఒకనాడు వినతా - కద్రువలు ఒక చోటకు కలిసి షికారువెళ్ళడం తటస్థించింది. వారికి అక్కడ కనుచూపుమేరలో కనుపించీ కనుపించనట్లు ఒక తెల్లనిగుర్రం కనుపించింది. దానిని చూచిన వినత 'చూడు కద్రువా! ఇంద్రునిగుర్రం అంతా తెల్లగా వుంది. ఎంత బాగుందో' అంది. అందుకు కద్రువ అంది కదా: 'అయ్యో, వెర్రి వినతా! నీకు సరిగా ఆనలే దనుకుంటాను. గుర్రంఅంతా తెల్లగానే వుందికాని తోకమాత్రం నల్లగా వుంది. చూడు కావలిస్తే' అంది.

'ఆఁ! నీకు సరిగ్గా కనుపించలేదేమో? ఇంద్రునిగుర్రం తెల్లని తెలుపుకదా! అంతా తెల్లగా అలాకనుపిస్తూంటే నలుపంటా వేమిటే' అంది వినత

ఇలా ఒకరు తెలుపనీ - ఒకరుతోకమాత్రం నలుపనీ మాటపట్టింపు పెంచుకుని ఒకపందెం కట్టుకున్నారు: 'ఎవరు పందెం ఓడిపోతే వారు మిగతావారికి దాసీగా వుండాలి'అని.

అప్పటికే చీకటిపడవచ్చిందని రేపు తెల్లవారుజామున దగ్గరగా పోయి చూసివద్దాం అనీ యింటికి వెళ్ళిపోయారు.

ఇంటికిపోగానే కద్రువ కొడుకులైనసర్పాలను పిలిచి 'చూడండి పిల్లల్లారా! నేనూ వినతా పందెంవేసుకున్నాం. ఇంద్రునిగుర్రం తెల్లగావుంటుందని తను అంది; కాదు, తోక

మాత్రం నల్లగావుంటుందని నేను చెప్పాను. ఎవరిమాట గెలిస్తే వారికి ఓడిపోయినవారు దాస్యంచేయాలని పందెం వేసుకున్నాం. కాబట్టి తెల్లగావున్నగుర్రంతోకకు మీలో ఒకరు వెళ్ళి నల్లగా తోకకనపడులాగున చుట్టుకునివుండి నామాట నెగ్గించండి. అలాతోకను చుట్టుకొని నల్లగా తోకవుండేటట్టు మీరు చేయకపోతే నేను వినతకి దాస్యం చేయాలి అని చెప్పింది. ఆమాటలకు కద్రువ సర్పసంతానం అంతా ఒప్పుకోక ఎదురుతిరిగింది. తల్లికి కోపంవచ్చి మీరు 'ఒకమునిచేయు సర్పయాగంక్రింద ఆహుతి అయిపోతారు' అని శపించింది. ఆశాపానికి భయపడి వాసుకి అనేపాము తల్లి మాటప్రకారం ఇంద్రుని తెల్లగుర్రంతోకను నల్లగా కనుపించేలాగ తనశరీరాన్ని తోకకు చుట్టిపెట్టింది.

పందెంవేసుకున్న మాటప్రకారం వినత, కద్రువలు మరునాడు గుర్రంవద్దకు వెళ్ళారు.

'ఏమిటి! చాలా ఆశ్చర్యంగావున్నది. "నిన్న చూస్తే తెల్లగా వుంది. ఈనాడు నల్లగా తోక కనుపిస్తూంది' అంది వినత!

'సరే, చూశావా! నేను నిన్ననే అన్నాను తోక నల్లగా వుందని. నిన్న నీకు సరిగా కనుపించి వుండదు. నేను గెలిచాను కాన నువ్వే నాకు దాస్యంచేయాలి' అని హెచ్చరించింది. ఆ కద్రువ మాటలకు వినత ఒప్పుకోక తప్పిందికాదు పాపం!

వినతకు అప్పటిదాకా పిల్లలు లేరు. అలా దాసీతనం చేస్తూన్నసమయంలో గరుత్మంతుడు పుట్టాడు

ఆ పుట్టినకొడుకు పెద్దవాడై, తల్లి యిలా దాస్యం చేస్తూంటే చూడలేక 'అమ్మా! మనకు యీదాస్యమేమిటి? ఎంతకాలం అని ఈదాస్యం చేయడం' అని అడిగాడు. తను యిలా దాసీతనంచేయడానికిగల కారణం చెప్పింది తల్లి!

'అందుచేత కద్రువ సంతానమైన పాములను ఆడిస్తూ-సవతిబాధలను భరిస్తూ యిలా జీవితమంతా వుండాలి' అని చెప్పింది!

ఈమాటలకు గరుత్మంతుడు చాలా బాధపడిపోయాడు. ఏం చేయడమా అని ఆలోచించి ఒకనాడు సవతితల్లిఅయిన కద్రువవద్దకు వెళ్ళి 'పెద్దమ్మా! మీకు ఏంకావాలి లన్నా కోరుకోండి తీరుస్తా. మాదాస్యాన్నితొలగించ'మని కోరాడు!

దానికి కద్రువ సంతోషించి 'అయితే, మాకు దేవతలవద్దనున్న అమృతభాండాన్ని తెచ్చియిస్తే మీదాస్య విముక్తి చేస్తాను' అంది కద్రువ!

సరేనని ఒప్పుకుని తల్లితోచెప్పి తిన్నగా దేవతలవద్దకు వెళ్ళి, యుద్ధం చేసి, వారిని ఓడించి ఎలాగైతేనేం అతికష్టం మీద అమృతాన్ని తీసుకురాబోయాడు గరుత్మంతుడు.

ఇంతలో దేవాధిపతి అయిన ఇంద్రుడు 'గరుత్మంతా! నీవు చేసింది చాలా అన్యాయం. మా అమృతభాండాన్ని తీసుకుపోతే దేవతలందరూ కష్టపడిపోవాలి కనుక నువ్వే దైనా కోరుకో ఈ అమృతభాండాన్ని తప్ప' అన్నాడు!

ఆమాటలకు గరుత్మంతుడు 'దేవా! మాదాస్యవిముక్తికై మా సవతితల్లి కద్రువ కోరినకోరికయిది. ఇదియిస్తే మా దాస్యవిముక్తి అయిపోతుంది. కాబట్టి ఒకవిషయం చెబుతాను. నేను ఈఅమృతాన్ని మాసవతితల్లికియిచ్చినప్పుడుమాయోపాయంచేత ఆ అమృతభాండాన్ని నీవు తీసుకుపో! మాదాస్యవిముక్తి అవుతుంది, నీకు అమృతమూ దక్కుతుంది' అన్నాడు! ఇంద్రుడు అందులకు ఒప్పుకుని గరుత్మంతుని వెంటనే బయలుదేరి వెళ్ళాడు.

గరుత్మంతుడు ఈ అమృతభాండాన్ని తీసుకొనివెళ్ళి సవతితల్లికి చూపించి 'ఇదిగో మీరుకోరిన అమృతభాండం. ఈదర్భలమీద పెడుతున్నాను. ఇక నాభారం తీరిపోయింది. కాన మాకు దాస్యవిముక్తి కలిగింది. దీన్నిమీరు శుచులయి, జాగ్రత్తగా కాపాడుకోండి' అని చెప్పాడు. అందుకు మహానందమున సవతితల్లీ, పిల్లలూ శుచులయి వచ్చుటకు వెళ్ళారు.

ఇదేసమయమని తలచి ఇంద్రుడు తొందరగా ఆ భాండాన్ని వారు చూస్తూండగానే ఎత్తుకపోయాడు. కాని ఆతొందరలో అమృతభాండం తొణికి ఆదర్భలమీద కొంచెం అమృతం పడింది. అప్పుడు యిలాచేతికందిన అమృతాన్ని అందుకోలేకపోయామని బాధపడి దర్భలపైబడిన అమృతపు చినుకులను ఆతృతతో నాలుకపెట్టి నాకాయి. ఆదర్భగరుకుతనానికి ఒకేనాలుకగావున్న పామునాలుకమధ్యకు రెండుగా చీలిపోయింది.

ఆనాటినుంచీ గరుత్మంతునిసంతతి తనసవతితల్లిపిల్లలైన సర్పసంతతిపై ఎక్కడ కనుపించినా పగసాధిస్తూనే వున్నది.

అదే ఈఅడవిలో పాకుకుంటూవస్తూన్న నన్ను ఆ గ్రద్ద తన్నుకుపోవడానికి కారణం' అని చెప్పి 'బాగుందా మాకథ'అని అడిగింది పాము.

నాగు కథంతా చెప్పింది! అంతకథనూ చాలాఉత్సాహంగా విని, 'మాఅమ్మ యింకా నాకు యీకథ చెప్పలేదు. చాలా బాగుంది, యీకథ' అని సంతోషంగా సమాధానం పలికింది పుట్టపురాణి!

'నాగూ! నాగూ!! నీకు మాఅమ్మకుమల్లేనే చాలా కథలు వచ్చునులాగుంది. నావద్దనే వుంటూ మంచిమంచి కథలు చెబుతూండవా?' అని అడిగింది పుట్టపురాణి. అందుకు 'సరే! నీవద్దనే వుంటానులే' అని నాగు ఒప్పుకుంది!

నాగుకు ఓబుట్ట అల్లి, అందులో పక్కఏర్పాటుచేసి, తనతోనే ఆబుట్టను నెత్తినపెట్టుకుప్రేమగా కథలమీాద వుండే ఆప్యాయతకొద్దీ పుట్టపురాణి తిప్పుతోంది.

♦ ♦ ♦ ♦

దొంగలగూడెంలో నిద్రపోతూవుండగా పుట్టపురాణికి ఒకకల రావడం జరిగిందికదూ! ఆకలతోనే లేచి యిలా పారిపోయివచ్చి అడవులలో తనతల్లిదండ్రులను వెతుక్కుంటూ తిరుగుతూంది పుట్టపురాణి. ఉదయంలేచి చూచుకుంటే ప్రక్కలో పుట్టపురాణి లేదు. ఎంతో గారాబంగా పెంచుకునే

దొంగలనాయకునిభార్య బెంబేలుపడిపోతూ, పుట్టపురాణికోసం గగ్గోలెత్తసాగింది.

దొంగలముఠాఅంతా ఈవిధంగా జరిగినందుకు ఆలోచించసాగారు. తనభార్యకు కలిగిన కష్టాన్నిచూసి దొంగల నాయకునిమనస్సు బాధపడింది!

'నాముందరేనా పుట్టపురాణిని ఎత్తుకుపోయింది. దొంగల రాజు అంటే ఎవడో ఎత్తుకపోయినవారికి తెలియదు కాబోలు! సప్తసముద్రాలూ, ఖండఖండాంతరాలూ వెతికి ఎక్కడవున్నా పుట్టపురాణిని పట్టుకొంటానని ప్రతిజ్ఞపలికి భార్యకు ధైర్యంచేకూర్చి అతికోపంతో తనముఠాతో తిన్నగా తనచర్చలకేంద్రానికి వెళ్ళిపోయాడు దొంగలరాజు.

'పుట్టపురాణికోసం ఏంచేయడం? ఎక్కడెక్కడ వెతకడం?' అని చర్చించడం మొదలుపెట్టారు.

దొంగలరాణికి పిల్లలు పుట్టలేదు. అందుకు ఎంతగానో రాళ్ళకూ, రప్పలకూ మ్రొక్కింది గాని కడుపున ఓకాయ అయినా కాయలేదు. ఏపసిపిల్లవాడు కనుపించినా, పసిపిల్ల కనుపించినా ఎంతో ఆప్యాయతతో చేరదీస్తోంది. పిల్లలంటే మహాయిష్టం. పిల్లలకోసం ఏంచేయమన్నా చేస్తుంది. అంత మమకారం ఉండబట్టే తనభర్తఅయిన దొంగలరాజు చెట్టుతొర్రలోపడేసినపిల్లను చేరదీసి పెంచుకుంటోంది. ఆపిల్లకు ఎంతోముద్దుగా 'పుట్టపురాణి' అని నామకరణం చేసుకొంది. ఎక్కడ కందిపోతుందో అని పెంచింది. ఇలాటిసమయంలో

మాయమైపోయిన పుట్టపురాణికోసం అన్నాహారాలు మాని బెంగతో దుఃఖించసాగింది.

దొంగలముఠా మొత్తంమీదఒకనిశ్చయానికి వచ్చారు. ముఠా నాలుగుభాగాలుగా చీలి ప్రతిచోటా వెతికిపట్టుకో వాలని ఆప్రకారంగానే ముఠా బయలుదేరింది.

చిలుకను పిలిచాడు దొంగలరాజు. 'పుట్టపురాణి సంగతి నీకు ఏదైనా తెలుసునా? నీవు ఏమిటో చాలా ఆ ప్యాయతతో వింటున్నావు?' అని అడిగాడు!

దొంగలరాజు చాలాకోపిష్టి! కోపమొస్తే కత్తి అరగ దీస్తాడు. మాటతప్పామా చంపేస్తాడు. అటువంటి భయం కరునివద్ద మనం ఏంచెబితే ఏం అపాయం మెడకుచుట్టుకుం టుందో అని ఒణికిపోసాగింది చిలుక!

'ఏం! ఏం మాట్లాడకుండా వున్నావు! నీవాలకం చూస్తే నాకు అనుమానంగానే వుంది. చెప్పు. నీకు ఏం కష్టం రాదు' అని హెచ్చరికచేశాడు దొంగలరాజు.

సరే! ఇక తప్పదు, మనకి ఈవిషయంలో చెప్పడం. తెలుసున్నవిషయంకాస్తా చెప్పివేయడమే మంచిది అను కొని చెప్పడం మొదలుపెట్టింది.

'పుట్టపురాణి ఒకరోజున విచారంగా కనుపించింది. ఏమని అడిగాను. అప్పుడు తనతల్లిదండ్రులు ఈదేశపురాజు గారి కోటలో బంధంపబడివున్నారనీ, వారిజాడ తనకు తెలుపు మనీ కోరింది. సరే అని వెతికాను. వెతకగా ఎక్కడా లేరు. చివరకు చిత్రవధచేయుటకు చిత్రవధబండరాయిమీాద పుట్టపు

రాణి తల్లిదండ్రులు ఒంగివున్నారు. భటులు కత్తులుఎత్తి నరకబోతున్నారు. ఈవిషయం వెంటనే పుట్టపురాణికి వచ్చి చెప్పాను. దుఃఖిస్తూ ఉపాయంచెప్పమని కోరింది.

అప్పుడు నీవద్దవుండే మంత్రపుఆకులసంగతి జ్ఞాపకం చేశాను. ఎలాగో వాటినిసంపాదించి పట్టుకువచ్చి, ఎలాగైనా నాతల్లిదండ్రులను రక్షించు మని ప్రాధేయపడింది. వెంటనే నేను వెళ్ళి ఆమంత్రపుఆకులను పుట్టపురాణి తల్లిదండ్రులమీద జల్లాను. కాని అలాజల్లుసమయంలో ఏ రూపంగా వారిని మార్చివేశానో మరచిపోయాను. అక్కడినుంచి తిన్నగావచ్చి పుట్టపురాణికి చెప్పాను. ఏరూపంలో తనతల్లిదండ్రులు మారిపోయారో చెప్పమని అడిగింది. మరచిపోయాను అని చెప్పాను.

అయ్యో! అని విలవిలా ఏడుస్తూ నావద్దనుంచి వెళ్ళిపోయింది తీరాచూస్తే తెల్లవారేటప్పటికే పుట్టపురాణి మాయమైపోయింది' అని చెప్పి, ఏమనబోతాడో నని బిక్కుబిక్కుమంటూదొంగలరాజువైపు చూడసాగిందిచిలుక.

చిలుక చెప్పినసమాచారమంతా విని ఉగ్రుడై పోయాడు దొంగలరాజు.

'నాకు తెలియకుండా ఆఆకురహస్యం ఎందుకు చెప్పావు?' అని మంత్రచిలుకను గట్టిగాకసరి, అయినా ఆపెట్టెవద్దవున్న కుక్క ఏంచేస్తోంది అడ్డుపెట్టక? అని కోపంతోవురుముతూ గదిలోని కాపలాకుక్కవద్దకు వెళ్ళాడు.

దొంగలరాజును చూసినకుక్క స్వాగతంగా తోక ఆడించింది. 'ఛీ! నీకు బుద్ధివుందా, లేదా? మంత్రపుబరిణె

లోని ఆకుతీస్తూంటే అడ్డుపెట్టకుండా ఎలా వూరుకున్నావు ?' అని గద్దించాడు ! ఒణికిపోతూ కుక్క 'నాకు ఏం తెలుసును? పుట్టపురాణి వచ్చి, బరిణె తీస్తూంటే అడ్డుకున్నాను. వెళ్ళి పోయింది. కాని తిరిగివచ్చి, మంత్రపుకర్రను చేతధరించి పెట్టె తెరిచింది. అలాటప్పుడు నేను ఏంచేయలేనుకదా ! అది కాకుండా ఆదండాన్ని ధరిస్తే ఏంచేయకూడదనికదా నీఆజ్ఞ !' అని అడిగింది కుక్క !

కుక్క చెప్పినమాటలకు చాలాకోపంతో 'అరే, నా మంత్రపుకర్రరహస్యంకూడా పుట్టపురాణికి ఎవరు చెప్పారు ? చూస్తూంటే చాలా ఆశ్చర్యంగా కనుపిస్తూంది' అని గట్టిగా కసరడం మొదలుపెట్టాడు దొంగలరాజు !

ఈఅరుపులకు వంటింట్లోవున్న దొంగలరాణి ఏమిటో అని బైటకు వచ్చింది.

ఆత్రుతగా 'ఏమిటి సమాచారం – పుట్టపురాణిసమాచారం ఏదైనా దొరికిందా ?' అని అడిగింది.

'ఆ ! ఆ !! దొరికింది – దొరికింది' – అని కోపంగా ఉరిమిచూశాడు చిలుకవైపు, కుక్కవైపు. ఇలా కోపంగా వున్న తన భర్తను చూసేటప్పటికి దొంగలరాణికి ఏం అర్థంకాలేదు !

'ఏమిటి ? ఏం జరిగింది ?? విషయంచెప్పకుండా కోపగిస్తే!' అంది.

'ఏముంది ? పుట్టపురాణివిషయంలో ఎంతకథ జరిగిందో చూశావా ? చిలుక కొంతపని చేసింది. అవిషయం

మనకు తెలియదు. కుక్క కొంతపని చేసింది. ఆ విష యం మనకు తెలియదు. అసలు ఆ మంత్రపుకర్ర రహస్యం పుట్టపు రాణికి ఎలా తెలిసిందా అని ఆలోచిస్తున్నాను' అన్నాడు దొంగలరాజు.

'ఓ! అదా!! ఆ విషయం నేనే చెప్పాను, చెపితే వెంకొంపమనుగుతుందని నిన్న పుట్టపురాణి గదిలో కెళ్లి ఆడుకుంటూ ఆ పెట్టెవద్దకు వెళ్లిందట! కుక్క మొరిగిందట! ఏడుస్తూ నాతో 'అమ్మా! అమ్మా!! నన్ను కుక్క కరవ బోతోంది, ఆ పెట్టె తీస్తూ ఆడుకుంటూంటే' అని చెప్పింది.

'మరి కరవదా! అదీ కాపలాకోసమే కదా ఉన్నది! అలా పెట్టెవద్దకు వెళ్ళాలంటే ఆ మంత్రపుకర్రను చేతిలో వుంచుకోవాలి అని మాటవరుసకి చెప్పాను' అని విషయం తెలిపింది దొంగలరాణి!

'అందుకే అమ్మాయి మాయమైపోయింది' అని గద్దించాడు దొంగలరాజు!

చిలుకా, కుక్క, భార్యా - ఆ అరుపులకు హడలి పోయారు.

చిలుకనూ, కుక్కనూ బయటికి పొమ్మని చెప్పి దొంగల రాజు చేరి భార్య 'అమ్మాయి ఎక్కడకు పోయిం దంటావు?' అని అడిగింది.

ఎక్కడికి పోయిందో ఎవరికి తెలుసు? వాళ్ళ అమ్మను తండ్రిని వెతుక్కుంటూ వెళ్ళిపోయి వుంటుంది. అందాల పుట్టపురాణి ఎక్కడవున్నా వెతకడంకోసం నాలుగు మూ

కూజనాన్ని పంపాను. ఇప్పుడు మాయచిలుకనుకూడ పుట్టపు రాణిజాడలను గుర్తించడంకోసం పంపుదా మనుకుంటున్నాను' అన్నాడు దొంగలరాజు.

'ఆలస్యం చేయకండి. నేను పుట్టపురాణిని వదిలి ఒక రోజుకూడా వుండలేకుండా వున్నాను. వెంటనే మాయ చిలుకను పంపండి'.అని ప్రబతిమాలింది భార్య.

భార్య ఆతృతను గుర్తించి దొంగలరాజు పుట్టపురాణిని వెతుక్కుని, గుర్తులు తెమ్మని మాయచిలుకను పంపించాడు.

తిన్నగా బయలుదేరి ఒక్కొక్కచోటికే వెళ్ళుతూ పుట్టపురాణి అడుగుల వాసననుబట్టి వెతకడం ప్రారంభించింది మాయచిలుక.

♦ ♦ ♦ ♦

అదే దేశపు రాజుగారికి గుర్రంపిల్ల విషయంలో సాక్ష్యంచెప్పవలసిన తల్లీ దండ్రీ పిల్లా మాయమైపోవడం, పరాయిదేశపురాజుగారు వీరిని అనుమానించి మాటలుఅనడంతో చాలా బెంగపెట్టుకుని, మంత్రీ, రాజూ చాలా ఆలోచిస్తూ వున్నారుకదూ!

ఇలా ఆలోచనలో మునిగివున్న అదే దేశపురాజుగారు ఒకరోజున ఏం తోచకుండావుంటే మంత్రితోసహా పక్కనేవున్న ఒక అడవికి షికారు బయలుదేరారు.

అలా షికారుకు బయలుదేరి చాలాకాలమైంది. అందుకుగాను కొంచెం మనస్సుకు విశ్రాంతిగా వుంటుందని

తలచి, రాజూ మంత్రీ ఆ ఆడవిలో అలాగే ముందుకు వెళ్ళారు.

అలా కొంతదూరం వెళ్లి ఒకపెద్ద మర్రివృక్షంనీడన కొంతసేపు విశ్రాంతిగా గడుపుదామని కూర్చున్నారు.

రాజూ మంత్రీ ఏదోకబురులు చెప్పుకుంటూ మాటల మధ్యలో రాజు 'మంత్రీ! మరి ఎంతకాలమని యిలా పరాయి దేశపురాజుచేత మాటలతో అగౌరవపడి వుండడం! అనవస రంగా గుర్రంపిల్లకోసం ఇలా పట్టింపులు పెట్టుకొనివుంటే బాగులేదు. పోనీ, ఇంతకాలంగా భటులు గుర్రంపిల్లకోసం ఎంచుకున్న సాక్షులు తల్లీ, తండ్రీ, పిల్లాకోసం వెతుకు తున్నారు. అయినా ఇంతవరకు ఒక్కరి జాడా కనుపించ లేదే! అందుకు ఏదో ఒక ఆలోచన ఆలోచించు' అన్నారు రాజుగారు !

ఈమాటలు మాట్లాడుతూన్న చెట్టుక్రిందనే ఒకఊడ ప్రక్కగా—తిరిగి తిరిగి అలసటచేత ఆఅడవిలోనే పుట్టపురాణి కూర్చునివుంది. పుట్టపురాణి అలాకూర్చునివుండగా తనవద్దనే వుంటూన్న నాగు అలాపాకుకుంటూ చెట్టుచుట్టూ తిరుగుదా మని వచ్చింది. రాగా రాజూ - మంత్రీ కనుపించారు. వెంటనే పడగఎత్తి బుస్ మంది. ఎవరిమీద మననాగు బుసలు కక్కుతూంది అనుకుని పుట్టపురాణి తిన్నగా రాజూ-మంత్రీ వున్నచోటుకే వచ్చింది. చూసీ చూడడంతోనే రాజును గుర్తించింది పుట్టపురాణి! కానీ రాజుగారుమాత్రం గుర్తించలేకపోయారు. కారణం - దొంగలరాణిగారాబం కొలదీ వంటినిండా పూసలూ- గాజులూ- రంగులదుస్తులూ

నింపింది. అందుకు ఏమాత్రం రాజుగారికి ఈపిల్ల 'చంద్రవదన' అన్నగుర్తు రాలేదు.

పామునుచూసిన రాజు 'బాబోయ్' అని యెగిరి గంతేశాడు. 'చచ్చిపోయానురా భగవంతుడా!' అని మంత్రి పరుగుతీశాడు.

ఇంతలో పుట్టపురాణి 'భయపడకండి! మిమ్ములను నాగు ఏం చేయదు' అని వారికి ధైర్యంచెప్పింది.

'నీపేరు ఎవరు? నీవు ఒక్కతెవు ఇక్కడ ఎందుకు వున్నావు?. పామునుచూస్తే భయపడకుండా ఎల్లా వున్నావు?' అని రాజుగారు అడిగారు.

ఈరాజుఫలానాఅనీ, తనతండ్రినీ తల్లినీ తననూ గుర్రంపిల్లవిషయంలో సాక్ష్యంవేసుకొన్నది ఇతనే అనీ - తెలుసున్నా తన అసలుపేరు చంద్రవదన అని చెప్పకుండా 'పుట్టపురాణి' కోయమంత్రగాడికూతురిని అనీ చెప్పింది. ఇంతదాకా మంత్రీ రాజుమాటలనుగురించి ఏదోఆలోచిస్తూ న్నాడు. పుట్టపురాణి 'నేను కోయమంత్రగాడి కూతురిని' అని అనగానే ఒక్కసారిగా దిగ్గునలేచి, 'మహారాజా! మనం ఇక ఆలోచించవలసినపని లేదు. కోయవాళ్ళు మంచిమంత్రవిద్యలు తెలిసినవారు వున్నారనేది మీకు తెలుసునుకదా! మనం ఈపిల్లచేత మనసాక్ష్యాలు ఎలా మాయమయ్యాయో తెలుసుకో వచ్చును. ఈపిల్లలో ఎంతమహత్తోలేకపోతే ఈపామును దగ్గరపెట్టుకుని ఒంటరిగా అతిధైర్యంగా ఈఅడవిలో వుంటుందా? కాన ఈకోయకన్యను తీసికొనిపోదాము' అని చెప్పాడు.

మంత్రిఇచ్చినసలహా బాగానే వుందని తలచి 'పుట్టపు రాణీ! నువ్వు మాయింటికి వస్తావా? నేను ఒకమహారాజును. నాకోటలో యేకష్టమూలేకుండా పూర్తిగా స్వాతంత్ర్యంతో అడివిలో తిరిగినట్లుగానే వుండవచ్చును' అని కోరాడు, అదేదేశపుమహారాజు!

ఇటువంటిఅదనుకోసమే ఎదురుచూస్తోంది పుట్టపురాణి మనసులో. తనకుఅనుకోకుండా సమకూరిన ఉపకారానికి దేవునికి నమస్కరించుకొని, తనతల్లిదండ్రులజాడ అక్కడనుంచి తెలుసుకోవచ్చును. అని తలచి 'సరే! మహారాజా! నీతో రావడానికి నాకు అభ్యంతరంలేదు. కాని నాకు అవసరం అని అడిగినప్పుడు ఏదైనా సహాయంచేయాలి. అందుకు మీరు సరే' అంటే బయలుదేరివస్తాను' అంది పుట్టపురాణి!

'ఓ! అంతకన్నానా! బయలుదేరు' అన్నాడు మహారాజు!

తనష్టానుప్రకారం వస్తానని ఒప్పుకున్నందుకు మంత్రి ఎంతో గర్వించాడు.

తిన్నగా అక్కడనుంచి మహారాజు, మంత్రి, పుట్టపు రాణి బయలుదేరి కోటలో ప్రవేశించారు.

అదే దేశపు రాజుగారుకూడా ఈకోయకన్యఅయిన పుట్టపురాణిద్వారానే - గుర్రంసాక్షులు ముగ్గిరిసమాచారం తెలుసుకోవచ్చునుగదా అని మనస్సును కొంత కుదటపర్చుకున్నారు. ఆరాజుగారికి ఒకకుర్రవాడు వున్నాడు. ఆకుర్రవాని పేరు సమభావుడు. సమభావునకు ఆటలన్నా షికారులన్నా మహాయిష్టం. అతిచురుకైనవాడు. తనతండ్రి షికారు

కని అడవికివెళ్ళి వెంటపెట్టుకువచ్చిన కన్యను చూశాడు. రానురాను పుట్టపురాణితో ఆకోటలో ఏం ఎరమరికలు లేకుండా ఆడుకోవడం మొదలుపెట్టాడు.

ఇలా పదిరోజులు గడిచాయి. సమభావుడు, పుట్టపు రాణీ కోటవెనుకనేవున్న ఒకఉద్యానవనంలో ఆడుకుంటు న్నారు. పుట్టపురాణి కోటలో లేనిసమయంచూసినరాజు రహస్యంగా మంత్రినిపిలిచి 'మంత్రీ! ఆకోయకన్యకు మం త్రాలు తెలుసుననికదా మనం కోటలోనికి చేరదీసింది. కనుక యిలాకాలయాపనచేసినందువలన లాభంలేదు. వెంటనే విషయంకోసం కోయకన్యను సిద్ధపరచు' అని ఆజ్ఞాపించాడు రాజు.

అదేప్రకారం పుట్టపురాణిని ఒకరోజున పిలిపించి 'మరి నీవు కోయపిల్లవుకదా! నీకు మంత్రాలేమైనా వచ్చు నా?' అని అడిగాడు మంత్రి.

మంత్రి తనను అడుగబోయేది తనతల్లిదండ్రులసంగతే నని ముందే గ్రహించి పుట్టపురాణి వెంటనే ఒక నిర్ణయానికి వచ్చేసి, 'ఓ! నాకు చాలావిద్యలు వచ్చును. పోయినవస్తు వులుజాడ చెప్పగలను. ఏదొంగఅయినా మీకోటలోనుంచి గాని లేదా ఫలానాచోటునుంచి అని చెబితే ఆ ప్రదేశపు బలాన్నిబట్టి వారు ఎటు ఎప్పుడు ఎలా వెళ్ళిందీ ఎక్కడున్నదీ కూడా చెప్పగలను' అని చెప్పింది.

అందుకోసమనే తీసుకువచ్చినరాజుగారికీ, మంత్రిగారికీ ఈవార్త ఎక్కడలేని సంతోషాన్ని తెచ్చిపెట్టింది.

'ఓ! ఇంకేముంది? పరాయిరాజు మనమీదవేసే అబాండాలన్నీ పటాపంచలైపోతాయి. మనరాజుగౌరవం కూడా దక్కుతుంది. గుర్రంపిల్లవిషయంలో న్యాయం చేకూరుతుంది' అని ఎగిరిగంతేశాడు రాజు.

ఇంతదాకా - ఏంచేయడమా అని ఆలోచనలతో బుర్రపాడుచేసుకుంటూన్న మంత్రి 'అమ్మయ్యా! ఇప్పటికైనా తరుణోపాయం కనుపించింది' అని సంతోషపడ్డాడు.

'అయితే మాకు ఒకప్రశ్న తీరనిసమస్యగా వుంది. ఆసమస్యను చెబితే తీరుస్తావా?' అని అడిగాడు మంత్రి.

'ఓ చెప్పండి. వెంటనే మంత్రంతో పూజచేసి పిట్టచేత పలికిస్తాను' అంది.

'ఈకోటకు ఫలానాదిక్కున ఒకతోట వుంది. ఆతోట ప్రక్కనే ఒకపెద్దచెట్టు వుంది. ఆచెట్టునీడన ఈదేశానికి అధిపతి అయిన రాజుగారు, పక్కరాజ్యాధిపతిఅయిన మరొకరాజుగారు ఒకనాటిరాత్రిసమయమున విడిదిచేశారు. ఆసమయంలో వారిగుర్రాలను చెట్టువద్ద కొంచెకొంచెందూరంలో కట్టిపెట్టారు. నిదురించి లేచేటప్పటికి ఒకగుర్రంపిల్ల పుట్టింది. అది నాదని ఆడగుర్రంస్వంతదారైన ఈదేశపురాజు అన్నారు. అబ్బే కాదు! ఇది నాది అని మొగగుర్రంసొంతదారైన పరాయిరాజుగారు అన్నారు. ఇద్దరిమధ్యా గుర్రంపిల్ల నాదంటే నాదని తగాదా ముదిరింది. ఆనిర్మానుష్య ప్రదేశంలో సాక్ష్యంగాని, న్యాయంగాని చెప్పగలిగినవ్యక్తులు ఎవరూ కనిపించలేదు. ఎలాగాఅని ఎదురుచూస్తూంటే

ప్రక్కనే వృద్ధదంపతులు కూతురితో వుండడం కనిపించింది. వారిని న్యాయం చెప్పమని అడిగారు రాజుగారిద్దరూ.

కాని వారు ఏంచెప్పలేదు. అదేదేశపురాజుగారికి కోపంవచ్చింది. 'రేపుఉదయంలోపల ఏదోఒకమాట చెప్పా' లని హెచ్చరించి వెళ్ళిపోయారు.

తిరిగి మరునాడు చూస్తే ఆకుటుంబం మాయమై పోయింది. అప్పటినుంచి వారిజాడకోసం వెతుకుతున్నాం. కాని తెలియలేదు. ఆవ్యక్తులు ఎక్కడవున్నారో చెప్తే నీకు కావలసింది ఇస్తాం' అని కథ ఎరుకపరిచాడు మంత్రి !

లోలోపల నవ్వుకుంది, కన్నులుండీ తనే'చంద్రవదన' అని గుర్తించనందుకు పుట్టపురాణి !

ఏదో తతంగం చేయాలిగదా! మంత్రాలనీ, తంత్రా లనీ ! అందుకు ఒకచోట పసుపు - కుంకుమతో ముగ్గులు తీర్చింది. పువ్వులతో అలంకరించింది. దానిచుట్టూ నాగును తిరుగమంది.

ఇదిఅంతా మంత్రి ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

'రాజుగారిని పిలవండి' అంది గంభీరంగా పుట్టపు రాణి.

రాజుగారు వచ్చి ఎదురుగుండా నుంచున్నారు.

'ఆపుష్పాలలో ఒకదానిని తీసుకొని, మనసులో మీాదేవునితలచుకుని ఒకదిక్కు చెప్పండి' అంది.

పువ్వు అందుకుందా మనుకున్నాడు రాజు. చుట్టూ నాగు కనుపించింది. వెనుకకు అడుగేసి భయంగా నిలబడి పోయాడు. రాజును పడిపించడంకోసమే అలాచేసిన పుట్టపు

రాణి పకపక నవ్వుతుంది. తిన్నగా తానే ఒకపుష్పాన్ని అందుకొని అందించింది.

పువ్వును చేతులతో అందుకొని, యిష్టదేవతాప్రార్థన చేసినరాజుగారు 'తూర్పు' దిక్కు అన్నారు.

'దూరంగా వెళ్ళి కూర్చోండి' అని రాజుగారిని, మంత్రి గారిని కూర్చోబెట్టింది.

'ఒకపువ్వును తను అందుకొని ఆపువ్వుతో నాగు మయ్యకు పూజచేసింది. ఉన్నట్లుండి ఒక్కసారిగా 'మీ సాక్షులు దొరికారు' ఆవేశపూరితంగా అంది.

'దొరికారా? ఎక్కడ??' అని ఉత్సుకతతో రాజు ముందుకు వచ్చాడు. వెంటనే మంత్రి లేచాడు.

'ఆముగ్గురూ చెట్టుక్రింద నిదురిస్తూండగా మీభటులు వెళ్ళి వారిని కోటలో బంధించారు వారిమీద అన్యాయంగా ఒక కేసు బనాయించి, చివరకు వారికి 'చిత్రవధ' శిక్ష విధించారు. మీభటులు వారిని ఫలానా 'తూర్పుదిక్కున' ఉన్న అడవిలో చిత్రవధచేశారు! ఇదీ నామంత్రంపిట్ట పలికే మాటలు' అంది పుట్టపురాణి.

ఈమాటలు విన్నరాజూ - మంత్రీ గజగజ ఒణికి పోయారు. ఏమిటీ 'మన రాజ్యంలోనే మనకు తెలియకుండా చిత్రవధచేయడం ఎలాగ జరిగింది?' అనే ఆలోచనతో తిన్నగా కోటలోపలికి వెళ్ళిపోయాడు రాజు.

'మంచిపన్నాగం పన్నాం. ఈరాజును యిలా ఏడిపించుకు తినాలి. అనుకుంది పుట్టపురాణి.

అలా చిత్రవధ జరగడానికిగల కారణ మేమిటి? వెంటనే దర్యాప్తుజరిపించుమని మంత్రిని కోరాడు రాజు.

దర్యాప్తుప్రారంభమైంది. చిత్రవధకోసమని అడవిలో రాయిమీదపరుండబెట్టగా పాములు అయిపోవడం, ఆపాములను చూసినభటులు భయంతోపారిపోయికోటకుజేరుకోవడం జరిగిందికదూ! వారికి ఈ దర్యాప్తుసంగతి చెవినిపడింది. 'అయ్యో! భగవంతుడా! చిత్రవధచేస్తూంటే వారిద్దరూ ఇలా పాములుగామారిపోయారని చెప్పితే ఏంకోపగిస్తారో కోట లోపల పెద్దలు అని రహస్యంగా ఆవిషయాన్ని దాచివుంచాము. ఈనాడు ఆవిషయం అడిగితే ఏంచెప్పడం' అని ఒణికిపోసాగారు ఆభటులు

దర్యాప్తులో ఒక్కటొక్కటే సమాచారం బయట పడసాగింది.

చిత్రవధసమయంలో వున్న భటులు పాములుగా మారిపోయారు వృద్ధదంపతులు అంటే ఈనాడే పుట్టపురాణికి తనతల్లిదండ్రులు పాములుగా మారిపోయారని తెలుసుండేది. కాని ఆభటులు ఏంకొంపమునుగుతుందో అని చెప్పకుండా వున్నారు.

ఇలాగ దర్యాప్తులమీద దర్యాప్తులతో నెలలుగడచి పోయాయి. కాని సాక్షులసమాచారాలకు సంబంధించినపనులు ఇంకా ముగియలేదు.

అదే కోటలో రాజకుమారుడు సమభావుడు పుట్టపురాణితో ఆడుకుంటూ, రానురాను ఒకరినొకరువిడువలేకుండా అన్యోన్యంగా వుండసాగారు. పుట్టపురాణికి ఆకోటలో, ఆతో.

టలో, ఆఖరుకు ఆరాజధానిలో అడ్డులేకుండా పోయింది. అటువంటి స్వాతంత్ర్యాన్ని ఇచ్చివున్నాడు రాజుపుట్టపురాణికి.

పాపం రాజుమనస్సులో చాలబాధపడసాగాడు, తన రాజ్యంలో తనకు అవసరమైనసాక్షులు అనుకోకుండా చిత్రవధ చేయబడినందుకు. పుట్టపురాణిద్వారాసాక్షులు దొరుకుతారనీ, పరాయిదేశపురాజుతో ముక్కో - చెక్కో తేలిపోతుందనీ తలచినరాజుకు ఈవార్త వెన్నువిరిగినంతపని అయింది. ఏం చేయడమా అని ఆలోచించసాగాడు రాజు! ఎటూ ఆలోచన తట్టలేదు. ఒకరోజున ఒకఆలోచన తట్టింది. 'పుట్టపురాణి మంత్రవిద్యలు నేర్చిందికదా! అందుకు పుట్టపురాణినే ఈ గుర్రంపిల్లవిషయంలో ఏదోఒకఉపాయం ఆలోచించ మని కోరుదాము' అనుకొన్నారు రాజుగారు.

'ఒకరోజున పుట్టపురాణి రాజకుమారునితో మహా సంతోషంగా ఆడుకుంటోంది. ఆసమయంలో తిన్నగా రాజు గారు అక్కడకువెళ్ళి పుట్టపురాణిని చేరి, మంచిమంచి కబుర్లు చెప్పి, 'నీవు నాకు ఒకసహాయం చేయవలసివుంది. తప్పదు. ఏమంటావు?' అని అడిగారు.

'నాకు అందుబాటులోవుండే ఏపనినైనా ఏఉపకారా న్నైనా చేస్తాను' అంది పుట్టపురాణి!

'అబ్బే! మ రేం లేదు. నాకు ఒకసమస్య తీరకుండా వుంది. అదే నీకు చెప్పిన సాక్షులవిషయం. ఇక ఎలాగూ ఆ సాక్షులు రారుగనక పరాయిదేశపురాజుగారికీ నాకూ

వచ్చిన గుర్రంపిల్ల తగాదాలో నువ్వు ఏదో ఒకఉపాయం ఆలోచించి ఈ సమస్యను తేల్చవలసిందిగా కోరుతున్నాను. ఈ సమస్యనుగనక తీర్చి ఏదో ఒకపని ముగించావా, నీకు ఏం కావలెనన్నా యిస్తాను. నువ్వు కోరుకున్న ఏ కోరిక సైనా కాదనకుండా తీరుస్తాను' అన్నాడు మహారాజు.

రాజు చెప్పినమాటకు ఒప్పుకుంది పుట్టపురాణి.

'వెంటనే పరాయిదేశపు రాజుగారికి గుర్రంవిషయంలో ఏదోఒకటి తేల్చుకుందా మని కబురు పంపాడి. అలా వచ్చిన రాజుగారిని నేను ఏదో మాటలలో పెట్టి ఓడిస్తాను. ఆవిధంగా గుర్రంపిల్లవిషయం తేల్చివేస్తాను' అంది పుట్టపురాణి.

ఆమాటలకు మహారాజు చాలా సంతోషం వెలిబుచ్చి వెంటనే పరాయిదేశపురాజుగారికి కబురుచేశాడు.

పుట్టపురాణి 'ఎలాగ ఈ రాజుగారిని ఓడించడం'అని ఆలోచన చేయసాగింది. ఎలాగైతేనేం ఒక ఉపాయం ఆలోచించి సిద్ధమయింది.

తిన్నగా రాజుగారివద్దకు వెళ్ళి 'రాజా ! పరాయిదేశపు రాజుగారు రాగానే కొలువుతీరిన మీా సభలో ప్రవేశపెట్టండి. మీా మంత్రినీ, సలహాదారులనూ, భటులనూ కిటకిటలాడేటట్లుగా సభను కూర్చండి. ఆ సమయంలో లోనికి నేను వస్తాను. 'నువ్వు ఎవరు? యిలా కొలువులో ప్రవేశించడానికి'

అని నన్ను మీరు గదమాయించండి. తరువాత జరిగేది అల్లా అక్కడ చూడండి' అని చెప్పింది పుట్టపురాణి.

కబురు అందుకున్న పరాయి దేశపు రాజుగారు తిన్నగావచ్చి కోటలో ఏర్పరచిన కొలువులో ప్రవేశించారు.

ఇద్దరు రాజులమధ్య గుర్రంపిల్ల విషయమై చర్చ ప్రారంభమైంది. చర్చలు మంచి జోరుగా సాగుతున్నాయి.

ఇంతలో పుట్టపురాణి తనతో కలిసి ఆడుకునే రాజ కుమారుని పిలిచి 'వెంటనేమీఅమ్మ కట్టుకునే మంచిదుస్తులు, ఆభరణాలు తే. వేషంవేసి ఒకపని జరిపించా' అని చెప్పి రాజకుమారుడు తేగా ధరించుకొని, తిన్నగా ఒక్కతే కొలువుతీరివున్న కోటలో "అమ్మా! అమ్మా!! అంటూ ప్రవేశించింది. ఒకసారి సభంతా గొల్లున నవ్వులతో ప్రతిధ్వనించింది.

'ఎవరు నువ్వు? రాజప్రాసాదంలో ప్రవేశించడానికి?' అని భటులు గద్దించారు పుట్టపురాణిని.

'నేను మా అమ్మకోసం వచ్చాను. మాఅమ్మ ఈ కొలువులో చర్చలు జరపడంకోసం వచ్చిఉన్నది. అదిగో! అంటూ పరాయిదేశపురాజుగారివద్దకు వెళ్ళి 'అమ్మా' అమ్మా' అంటూ కూర్చుంది పుట్టపురాణి.

సభఅంతా తిరిగి మరోమారు గొల్లున నవ్వింది.

ఈ సమయంలో మంత్రికి కనుసంజ్ఞచేసింది 'కదులూ' అని పుట్టపురాణి.

ఈ తతంగంఅంతా చూసి ఏమీఅర్థంకాక చూస్తూ న్నాడు పరాయిదేశపురాజు. ఇంతలో మంత్రి వచ్చి 'ఏమిటి అమ్మాయీ! ఇక్కడ ఎవరూ ఆడవారు లేరు. మీఅమ్మ మరెక్కడేనా వుందేమో చూడు' అని అన్నాడు.

ఆమాటలకు పుట్టపురాణి 'అబ్బే! మాఅమ్మ ఇక్కడే వుంది! ఇదిగో' అంటూ పరాయిదేశపురాజువద్దకు పరుగెత్తి పోయి కూర్చుంది.

ఇంతలో ఆదేశపు రాజుగారు కోపావేశంగా 'యీపిల్ల ను జైలులో కట్టి పడవేయండి' అని ఆజ్ఞాపించారు.

ప్రక్కనేవున్న పరాయిదేశపురాజుకు యిలా పిల్లను 'జైలులో కట్టిపడేయండి' అనగానే బాధకలిగి, ఆగండి, పాపం మంచిగాచెప్పి బోధించి పంపివేదాము' అని పుట్టపురాణిని దగ్గరగా తీసుకొన్నాడు, పరాయిదేశపురాజుగారు !

'అమ్మాయీ! నీపేరు ఎవరమ్మా? ఎక్కడైనా మొగ వారు తల్లిఅవుతారా? ఆడవారు తల్లిఅవుతారుగాని. అమ్మ అనే వస్తువు ఆడదిగాని మొగదికాదు' అని ఓదార్చిబోధింప జూచాడు పరాయిదేశపురాజు.

అప్పటికి మంత్రికీ, రాజుగారికీ పుట్టపురాణిపన్నిన పన్నుగడ అర్థమయి, మనసులో పుట్టపురాణి తెలివితేటలను మెచ్చుకొనసాగారు.

'మహారాజా! ఆడది తల్లిఅవాలంటే ఆడదాని కడు పునేకదా జన్మించాలి?

మొగదాని కడుపున పుట్టడం జరగదు కదా! ఈ మాత్రం మీకూ, ఈ సభాసదులకూ తెలిసుంటే చాలా సంతోషం' అని సభను తేరిపార చూసింది. అప్పటికికూడా పరాయిదేశపురాజుగారు తనను దెబ్బకొట్టబోతోంది ఈ పుట్టపురాణిప్రశ్న అని గ్రహించలేదు.

ఇంతలో మంత్రి లేచి 'అమ్మాయీ! మేము ఒక ముఖ్యమైన చర్చలో మునిగివున్నాము. కావలిస్తే నువ్వు గొడవచెయ్యకుండా విను' అని గుర్రంపిల్లచర్చను సాగించారు.

పరాయిదేశపురాజుగారు లేచి 'గుర్రంపెట్టినపిల్ల నాదే ఎంతకాల మని ఈచర్చ?' అన్నారు.

ఇంతలోకే ఆదేదేశపు రాజుగారు లేచి 'అయ్యా! అది నాగుర్రంపెట్టిన పిల్ల' అన్నారు.

వీరు యిలా వాదించుకొంటుండగా పుట్టపురాణి లేచి 'అయ్యా! ఈవిషయంలో ఒక్కమాట మాట్లాడడానికి అనుజ్ఞ యిస్తారా?' అని అడిగింది.

'సరే! ఏమిటి?' అన్నాడు మంత్రి.

'ఓ పరాయిదేశపుమహారాజా! నీగుర్రం పిల్లనుపెట్టింది అన్నారుకదూ? మీగుర్రం ఆడదా? మొగదా?' అని అడిగింది.

'నాగుర్రం మొగదే' అన్నాడు రాజు!

'మరి యిందాక నాకు బుద్ధిచెప్పారే? ఆడదాని కడుపున పిల్ల పుడుతుందిగాని, మగదానికడుపున పుడ్తుందా? అని అదే ప్రశ్న మీకు వేస్తున్నాను. మీ మొగగుర్రం పిల్లను పెట్టిందంటే లోకంనవ్వదా!' అని అడిగింది పుట్టపురాణి.

ఈమాటలకు సభంతా నిశ్శబ్దంగా అయిపోయింది.

పరాయిదేశపు రాజుగారు యిక ఏంమాట్లాడలేక దిగ్గునలేచి 'అమ్మాయీ! నీవంటి తెలివిగలపిల్లలు వుంటే, రాజ్యాంగంలో ఎంతో మేలు. నీ తెలివికి నాజోహార్లు' అని చెప్పి, తనమెడలోవున్న ముత్యాలహారాన్ని పుట్టరాపుణికి యిచ్చి చిన్నమొహంచేసుకొని వెళ్ళిపోయాడు.

ఎంతోకాలంగా తీరనిసమస్యగావున్న ఈసమస్యను మాట తెలివిచేత తీర్చిన పుట్టపురాణిని రాజు, మంత్రి, పరివారము అందరూ వేనోళ్ళ పొగిడారు. ఇక ఎక్కడికీ వెళ్ళకుండా తనకోటలోనే వుండవలసిం దని రాజుగారు కోరారు. ఆ ప్రకారంగానే కోటలో వుంటూంది పుట్టపురాణి. కాని, తల్లిదండ్రులసంగతి జ్ఞాపకంవచ్చినప్పుడల్లా లోలోపల దుఃఖిస్తూనేవుంది.

◆ ◆ ◆ ◆

దొంగలగూడెంనుంచి పుట్టపురాణి పారిపోయి తల్లిదండ్రులను వెతుక్కుంటూవచ్చేయడం, ఆ వెనుకనే మాయ చిలుక వెతుక్కుంటూ బయలుదేరడం జరిగిందికదా! అలా

వెతుక్కుంటూ, వెతుక్కుంటూ తిన్నగా అడవిలో పుట్టపు రాణి, పాము తిరుగాడిన చెట్టువద్దకు వెళ్ళింది.

అక్కడ పుట్టపురాణి అడుగులవాసన పసికట్టింది మాయచిలుక. అక్కడనుంచి తిన్నగా రాజు-మంత్రి-పుట్టపు రాణి కలసివెళ్ళిన దారివెంటే తిన్నగా గుర్తించుకుంటూ వెళ్ళింది మాయచిలుక. చివరకు ఆదారి తిన్నగా రాజుగారి కోటలోపలకు తీసుకెళ్ళింది!

ఆకోటలోపల రాజకుమారునితో కలసి సరదాగా ఆడుకొంటూంది పుట్టపురాణి. చూసింది చిలుక! ఇంతక్రితమే పుట్టపురాణికీ, తనకూ స్నేహంకలసిగదా

ఎప్పుడైతే పుట్టపురాణిని చూసిందో చిలుక పలుక రించకుండా వుండలేకపోయింది.

'ఏం! పుట్టపురాణీ! ఎలాగున్నావు? నీమూలంగా మా అందరకూ పెద్దగొడవ వచ్చేసింది. దొంగలరాజు నన్ను నీజాడకోసమని పంపించాడు' అని విషయంచెప్పింది చిలుక.

చిలుకతో యావత్తువిషయాలు మాట్లాడి 'మరి యిక వెళ్ళిపో' అంటుండగా తనపాము తిన్నగావచ్చి పుట్టపురాణి వద్ద నిలిచింది.

క్రితంలో పుట్టపురాణితల్లిదండ్రులను పాములుగా మార్చివేసి చావకుండా చేసింది ఈమాయచిలుకేకదూ! అప్పటినుంచీ పుట్టపురాణి తల్లిదండ్రులను ఏరూపంలోకి మార్చిందో మరచిపోయి చిలుక బాధపడుతూనే వుంది. ఇంత

వరకూ పాములరూపంలోనే తను వారిని మార్చానని చిలుకకుగాని, పాములుగానే తనతల్లిదండ్రులు వున్నారని పుట్టపురాణికిగాని తెలియదు.

ఇలా హఠాత్తుగావచ్చినపామును చూచి, చిలుక చాలానివ్వెరపోతూ ఆశ్చర్యంగా చూడసాగింది.

ఏమిటి చిలుకా! అంతవింతగా చూస్తున్నావు! ఈ పాము నాకు స్నేహంగా ఒకఅడవిలో కలిసింది. అప్పటినుంచీ నావద్దనే వుంటూంది' అని చెప్పింది పుట్టపురాణి!

'ఈసమయంలో ఇక విషయం దాచకూడదని, ఇంకా దాచి పుట్టపురాణికి శ్రమకలిగించడం మనస్కరించక 'నీతల్లి దండ్రులను చిత్రవధచేయుసమయంలో నేను మాత్రపుఆకులు చల్లి, పాములుగా మార్చివేశాను. ఇంతవరకూ నాకు జ్ఞాపకం రాలేదు. ఈనాడు నీవద్దనేవున్న యీ సర్పాన్ని చూడగానే పాతవిషయం జ్ఞాపకానికి వచ్చింది' అని చెప్పింది.

ఈమాటలు విన్న పుట్టపురాణి నిలువునా నీరైపోయి, ఆత్రుతతో 'అయితే చిలుకా! మరి నాతల్లిదండ్రులను ఎలాగా కనుక్కోవడం? ఎలాగా మానవులుగా మార్చుకోవడం?? ఈ ఉపకారం నీవు కాస్తచేసిపెట్టు. నీసహాయాన్ని మరువకుండా వుంటాను' అని బ్రతిమాలింది పుట్టపురాణి.

'దాని కేముందిలే? ఈమాత్రం సహాయానికి ఇంత బ్రతిమాలాలా! నీవు నాకు క్రొత్తదానవా! నీతండ్రిఅయిన దొంగలరాజువద్ద ఒకఆకు వుంది. ఆఆకుక్రితం పెట్టెలోది మాత్రం కాదు. అది యింకోబరిణెలోపెట్టి యింటివెనుకవున్న

మఱ్ఱిచెట్టుతొఱ్ఱలో దాచివుంచబడింది. దానికి కాపలాగా ఒకపులి నిలబడివుంటుంది. ఆపులిని కనుక మంచిచేసుకో గలిగితే, ఆఆకు దొరుకుతుంది. ఆఆకు కనుక నీవుపట్టుకొని తిన్నగావెళ్ళి నీయిష్టదైవాన్ని తలచుకొని ఏపామునైనా అడిగితే నీతల్లిదండ్రులుఅయిందీ కానిదీ అదే చెబుతుంది. ఏవయితే మానవరూపంలోకి రావలసియున్నాయో అవి ఈఆకుచూడగానే నీముందు తలలు వాలుస్తాయి. వెంటనే యీ ఆకులు చల్లితే అసలురూపం పొందుతాయి. మరి నేను వెళ్ళిపోతాను.. అవసరమైనప్పుడు నేను సహాయపడుతాను' అని చెప్పి సెలవుతీసికొని తిన్నగావెళ్ళిపోయింది చిలుక.

మాయచిలుకరాకను గుర్తించిన దొంగలరాణి 'ఏ మయింది? నాముద్దులకూతురు పుట్టపురాణిజాడ ఏమైనా తెలిసిందా?' అని ఆతృతతో అడిగింది.

'ఆ! తెలిసింది. పుట్టపురాణి సుఖంగావుంది. ఫలానా రాజసౌధంలో మహానందంగా రాకుమారునితో ఆడుకుం టూంది' అని చెప్పింది చిలుక.

తను ప్రేమతో గారాబంగా పెంచుకుంటూన్నపిల్ల 'ఉంది' అని తెలియగానే ఎంతో సంతోషపడింది, దొంగల రాణి. ఎలాగైనా తనపుట్టపురాణిని తిరిగి తెచ్చుకోవాలని ఉవ్విళ్లూరసాగింది.

తనభర్తను చేరి సమాచారమంతా తెలియచెప్పింది. ఉగ్రుడైపోతూ 'నాకనులలో కారంజల్లి నాకూతురు పుట్టపు

రాణిని తీసుకుపోయిన ఆరాజుఎవరో ? త్వరలోనే వాడిపస పట్టాను' అని హుంకరించాడు. ప్రక్కనేవున్న దొంగలతండాకు రాజసౌధాన్ని చుట్టుముట్టుప్రయత్నంలో వుండుమని ఆజ్ఞ యిచ్చాడు. సమయంకోసం ఎదురుచూస్తూన్నాడు దొంగల రాజు.

అక్కడ కోటలో పుట్టపురాణి తనతల్లిదండ్రులు పాములుగా మారిపోయినందుకు విచారిస్తూ 'ఎప్పుడు? ఎలాగ దొంగలరాజువద్ద మాయబరిణెలోని ఆకులు తెచ్చి తనతల్లి దండ్రులను సంపాదించుకోగలుగుతానా' అని ఆత్రుతపడ సాగింది. అదేరాత్రి వీలుంటే దొంగలగూడెంలో ప్రవే శించాలని నిశ్చయించుకుంది. ఇటువంటిసమయానికి భార్యను వెతుక్కుంటూ సర్పరాజు అలా పాకిపాకి, ఒకనాడు పుట్టపు రాణి నిలిచిన అడవిమధ్య మర్రిచెట్టువద్దకు చేరుకుంది. అక్కడే తనభార్యఅయిన ఆడసర్పం తిరిగినట్లు వాసన దొర కింది. కాని ఎంతగుర్తించినా ఎటూ దారిదొరకలేదు. ఆఖరికి ఎలాగైతేనేం ఒకమార్గంగుండా తనభార్యప్రయాణించినట్లు జాడలు కనుపించాయి. అయినా ఆశవదలక లోలోపలకలుసు కుంటామో? కలుసుకోలేమో? అని దుఃఖిస్తూ అలా పాకు కుంటూ కోటవైపుదారి తీసింది ఆసర్పరాజు.

♦ ♦ ♦ ♦

ఏనాడు పుట్టపురాణిని తెచ్చుకుంటామా? కళ్ళారా చూస్తామ? అని తహతహలాడసాగింది దొంగలరాణి. చెయ్యివిరిగినట్లుగా బాధపడసాగింది. ఏంతోచడంలేదు. ఇలా బాధపడుతూ నిరుత్సాహంగా వున్నసమయంలో చిలుక చూసింది. 'ఏమమ్మా! నువ్వు పుట్టపురాణికోసం యిలా బెంగతో నీరసించిపోతూ కూర్చుంటే ఎలాగ? తప్పకవస్తుంది. ఇక్కడనుంచి ముతాఅంతా వెళ్ళిందిగదా, వెతకటానికి.

మీరుఒక్కరే ఎందుకు ఈగూడెంలో బిక్కుబిక్కు మంటూ కూర్చోడం? హాయిగా అలా షికారుకు వెళ్ళి రారాదా? మనశ్శాంతి కలుగుతుంది' అని సలహాయిచ్చింది చిలుక.

ఏమీతోచకుండావున్న దొంగలరాణి-సరేలే వెళ్ళి వద్దాం, కొంతమనశ్శాంతిగానైనా వుంటుంది అని కాపలాగా అక్కడవున్న పెద్దపులిని నోటనిడుకొని అలా ప్రక్కవున్న అడవికి షికారుగా బయలుదేరింది, దొంగలరాణి.

ఈసమయంకోసమే ఎదురుచూసింది చిలుక! ఎప్పుడైతే గూడెంలో ఎవరూ లేరో, వెంటనే ఆమంత్రపు బరిణెను ముక్కుతో కరచుకొని తిన్నగా అందుకోసమే తహతహ పడుతూన్న పుట్టపురాణికి యిచ్చివేసి తనకు ఏమీ తెలియనట్లుగా గూడెంలోకి వచ్చివుంది చిలుక

చిలుకవచ్చిన కొద్దినిమిషాలకుదొంగలరాజు వచ్చాడు. 'ఏదీ రాణి? ఎక్కడికి వెళ్ళింది?' అని అడిగాడు.

'షికారు వెళ్ళింది. విశ్రాంతికోసమని వెడుతూ - వెడుతూ సహాయంగా ఆ కాపలాపులిని వెంటతీసుకెళ్ళింది' అని చెప్పింది చిలుక.

'అరే! ఆమంత్రపుబరిణెదాచినచోట కాపలాలేకుండా పులిని తీసుకెళ్ళిందా? కొంప మునిగింది' అంటూ పరుగున వెళ్ళి తొర్రలోని తనమంత్రపుబరిణెను చూచుకున్నాడు. ఉంటేకదూ బరిణె. ఇంతకుముందేకదూ, చిలుక ఆబరిణెను పట్టుకపోయి పుట్టపురాణికి యిచ్చివేసింది! అందులో బరిణె కనుపించకపోయేటప్పటికి ఎక్కడిప్రాణాలు అక్కడే నిలిచి పోయాయి—అరే! మనకళ్ళల్లో కారంకొట్టి పుట్టపురాణిని తీసుకపోయారు. ఇప్పుడుచూస్తే మంత్రపుబరిణెనే మాయం చేశారు అనుకొని, ఇదంతా చూడగా చూడగా ఎవరో కుట్రచేస్తూన్నారనే అనుమానంతో కోటమీద దాడికి సన్నాహంచేయసాగాడు దొంగలరాజు.

చిలుక బరిణెయిచ్చివేసిందికదా, పుట్టపురాణికి! ఆ బరిణెసహాయంతో దానిలోనిమంత్రపు ఆకులతో తనతల్లి దండ్రులను రక్షించుకోవచ్చునుగదా! అని మురిసిపోతూ ఆఆకులను చేత్తోపట్టుకుని తనవద్దవున్న సర్పాన్ని అడుగు దాము—మీలో ఎవరైనా మానవులు వచ్చి కలిశారా? అని తలచి పాముతిరుగుతూన్నవనంలోకి వెళ్ళింది పుట్టపు రాణి.

ఆదేసమయానికి తనభార్యను వెతుక్కుంటూ కోటలో అడుగిడింది సర్పరాజు.

తిన్నగా పుట్టపురాణి తనవద్దనున్నపామును చేరుకునేప్పటికే తనభార్యను చేరుకొంది సర్పరాజు.

ఇక జీవితంలో కలుసుకోలేము అనుకున్న సర్పరాజు భార్య తనభర్తనుచూసి మహానందంతో ముప్పిరిగొంది. ఇలా సర్పదంపతులు ఒకరినొకరు కావిలించుకొని ఓదార్చుకొంటూన్న దృశ్యాన్ని మహాశ్చర్యంతో నిలబడి చూడసాగింది పుట్టపురాణి.

తనచేతిలో మంత్రపుఆకులు వున్నాయి కదూ! వాటిని చేతధరించి అడిగితే అన్నిసంగతులూ తెలుస్తాయనీ ఆఆకులను మీదచల్లితే అసలురూపాలలోకి మారిపోతారనీ చిలుకచెప్పినమాటలను ఒకసారి జ్ఞప్తికితెచ్చుకొని వెంటనే ముందుకు వెళ్ళింది.

వెంటనే తనయిష్టదైవాన్ని తల్చుకొని చేతిలోని ఆకులను ఆసర్పములమీద చల్లి ఉత్సుకతతో చూడసాగింది పుట్టపురాణి.

ఎప్పుడైతే పుట్టపురాణి ఆకులు చల్లిందో పాములు మానవాకృతులలోకి ఎప్పటివలె మారిపోయారు. ఎదురుగుండా తనకూతురు చంద్రవదన కనుపించేటప్పటికి ఆవృద్ధ

దంపతులు ఒక్కసారిగా 'అమ్మా, చంద్రవదనా! ఎన్నాళ్లకు కలుసుకున్నాము. నీవు ఇంత తెలివైనదానవు, అదృష్టవంతురాలవని మాకు తెలియదమ్మా!' అని కావలించుకొని ముద్దు పెట్టుకున్నారు.

అలా చంద్రవదనా - వృద్ధదంపతులూ కలిసి మహా సంతోషంతో పాతకథనుగురించి చెప్పుకుంటూ ఉండగా 'పుట్టపు రాణీ!' అంటూ రాకుమారుడు వచ్చాడు.

'ఎవరు పుట్టపురాణీ?' అని వింతగా చూస్తున్నారు వృద్ధదంపతులు.

ఇంతలో తనకూతురు చంద్రవదనే ఆరాకుమారుని చేరడంచూసి ఆశ్చర్యంగా నిలబడిపోయారు.

అలావచ్చిన రాకుమారుడు చంద్రవదనా వచ్చి తల్లిదండ్రులకు నమస్కరించారు. 'అమ్మా నాస్నేహితుడు సమభావుడితడు, ఈదేశపురాజకుమారుడు' అని చెప్పి పరిచయంచేసింది చంద్రవదన.

'అమ్మా! నీపేరు పుట్టపురాణిఅని పిలుస్తున్నారేమిటి? అని అడిగింది చంద్రవదనతల్లి.

దొంగలు ఎత్తుకొనిపోయినగాథనూ - అక్కడ తనకు ఈపేరు పెట్టడమూ చెప్పి, పాతచరిత్రనంతా ఎరిగించింది చంద్రవదన.

ఈహడావిడిఅంతా చూసిన రాజుగారు యీవలకు వచ్చి ఏమిటో అని చూడసాగారు. తీరాచూస్తే తను గుర్రంపిల్లవిషయంలో సాక్షులుగా వేసుకున్న వృద్ధదంపతులు కనుపించారు. అప్పటికి గుర్తుకు వచ్చింది ఈపుట్టపురాణి ఆవృద్ధదంపతులకూతు రని.

'చిత్రవధచేయబడినారన్న వీరు ఎలావచ్చారా?' అని నిర్ఘాంతపోయి చూడసాగారు.

ఆవృద్ధదంపతులు మహారాజుకు ప్రణమిల్లి ఇదంతా మీదయవల్లనే అని పొగడసాగారు.

'అబ్బ! కాదు! అటు పరాయిరాజుముందర్న మాగౌర వాన్ని కాపాడింది మీచంద్రవదనే' అన్నాడు రాజుగారు.

'చిత్రవధనుంచి మమ్ములను రక్షించిందీ చంద్రవదనే' అన్నారు ఆవృద్ధతల్లిదండ్రులు.

అక్కడచేరినఅందరూ ఒక్కుమ్మడిగా-అవును, ఇదంతా 'చంద్రవదనచాకచక్యం' అని పలికారు.

అటు రాజుగారు తనకొడుకుతో నిలుచున్న చంద్ర వదనను 'శ్రీఘ్రమే కళ్యాణసిద్ధి రస్తు' అని దీవించి ఆవృద్ధ దంపతులను కోటలోపలికి ఆహ్వానించారు.

కోటలోపల మంగళతూర్యవాయిద్యాలు మ్రోగు తున్నాయి! ఇంతలో దొంగలరాజు, రాణి మారువేషాలతో వచ్చి కోటలో ప్రవేశించారు, ఎలాగైనా పుట్టపురాణిని ఎత్తుకుపోదామని. కాని, రాజకుమారునితో మహావైభవంగా కళ్యాణంజరుగుతున్న ఆకన్నులపండువ దృశ్యాన్ని చూసే టప్పటికీ ఆదొంగలదంపతులు హృదయంలో ద్వేషభావం పోయి ఆనందం పెల్లుబకసాగింది. కన్నులపండువుగా ఆకళ్యాణమండపంలోనే వుండిపోయారు.

తమకడుపున యింత అదృష్టవంతురాలు తెలివిగలపిల్ల జన్మించినందుకు అక్కడవున్న ఆవృద్ధతల్లిదండ్రులు ఆనంద భాష్పాలు రాల్చారు. చంద్రవదన కోడలుగాచేకూరినందుకు రాజుగారు సంతోషించారు.

ఆరాజప్రాసాదమంతా ఆకళ్యాణమండపంలో 'చంద్ర వదన చాకచక్యం' అనేమాట ప్రతినోటినుంచీ ప్రతిధ్వనించ సాగింది.

సమాప్తం

—o—

# మా స్వంత ప్రచురణలు

| | | | |
|---|---|---|---|
| కుముదిని | నవల | రవీంద్రనాథ్ టాగూర్ | 3.50 |
| రాసమణి కొడుకు | | ,, | 0.75 |

## పిల్లల పుస్తకాలు

| | |
|---|---|
| చంద్రవదన చాకచక్యం | 1-0-0 |
| మహామంత్రి యుక్తి | 0.50 |
| రతనాల లేడి | 0.50 |
| బాల డిటెక్టివ్ కథలు | 0.50 |
| బాల వినోద కథలు | 0.50 |
| బాల హాస్య కథలు | 0.50 |
| బాల సామెత కథలు | 0.50 |
| బాల నీతి కథలు | 0.50 |

ప్రతులకు :

**శ్రీ రామకృష్ణా అండ్ కో,**

**విజయవాడ-1.**

PRINTED AT ANDHRA PRINTERS VZA-2.



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA108B168 |
| పుస్తకం పేరు | చంద్రవదన |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 95 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, BCI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Nandini |
| పేజీలు విడదీసినది | Nandeni |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |